Tarbiyat ki Pahli Manzil
(Telugu)

# శిక్షణకు తొలిమెట్టు

మూలం

ఖుర్రమ్ మురాద్ (రహ్మలై)

అనువాదం

ఇఖ్బాల్ అహ్మద్

# నా మాట

వ్యక్తి జీవితమయినా, ముస్లిమ్ సమాజ జీవితమయినా దివ్య ఖుర్‌ఆన్‌తో ముడివడి ఉంది. అదొక్కటే సరయిన మార్గం చూపుతుంది, వెలుగు ప్రసాదిస్తుంది, స్వస్థత కలిగిస్తుంది. నేటికీ మనకోసం ప్రపంచంలో పురోగతికి మరియు సగర్వంగా తలెత్తుకోడానికీ ఏదైనా చిట్కా అంటూ వుంటే అది దివ్యఖుర్‌ఆన్ మాత్రమే అని, పరలోకంలో మోక్షానికి ఏదయినా మార్గం ఉందంటే అది దివ్యఖుర్‌ఆన్ ఒక్కటే అని నా విశ్వాసం. పద్నాలుగు వందల సంవత్సరాల క్రితం ముస్లింపై ఖుర్‌ఆన్‌కు ఏ హక్కైతే ఉండిందో అది ఏమాత్రం చెక్కుచెదరకుండా ఉంది. అదే దాన్ని వినడం, వినిపించడం, అర్థం చేసుకోవడం, వివరించడం, ఆచరించడం, ఆచరణవైపునకు స్వాగతించడం, దానిని ఉన్నతం చేయడానికి జిహాద్ చేయడమూను. పద్నాలుగు వందల ఏళ్ళక్రితం ఖుర్‌ఆన్ మానవులకు దేన్నైతే ప్రసాదించిందో ఈనాడు కూడా దాన్నే వారికి అనుగ్రహిస్తోంది. మనసుల్లో మెత్తదనం, మార్థవం, కళ్ళల్లో ఆర్ద్రత, దూరదృష్టి, విజ్ఞానం వివేచనల ఆణిముత్యాలు, జీవితం గడిపే తిన్నని, సులభమైన ప్రకాశవంతమైన మార్గం, భువిలో ఔన్నత్యం, ప్రాతినిధ్యం, పరలోకంలో మన్నింపు, స్వర్గం వగైరాలే ఆ మార్గం యొక్క సుగుణసంపద.

దర్సెఖుర్‌ఆన్ (దివ్యఖుర్‌ఆన్ బోధన) బాధ్యత నిర్వర్తించడానికి కావలసిన పరిజ్ఞానం, తఖ్వా, ఆచరణలు నాలో లేవన్న విషయం నాకన్నా బాగా ఎవరికీ తెలియదు. అంతేకాక ఎపుడన్నా ఏదయినా చెప్పినా దాన్ని పుస్తకరూపంలో ప్రచురించడం నాకు చేతనైన పనికాదు. అయితే ఒక్క విషయం నాకు బాగా తెలుసు. అదేమంటే, అల్లాహ్ నాపై దివ్యఖుర్‌ఆన్

వరాన్ని అనుగ్రహించినంత మేరకు దాన్ని వినిపించడం, వివరించడం దానివైపుకు పిలవడం నాపై మోపబడిన బాధ్యత అని నాకు బాగా తెలుసు. గ్రంథాన్ని ప్రసాదించినవాడే దానిని ఇతరులకూ వివరించాలన్న వాగ్దానం తీసుకున్నాడు. ఆ వాగ్దానాన్ని పూర్తి చెయ్యనివారు, ఆ గ్రంథాన్ని మరుగు పరిచినవారిపై ఆయన తన శాపం మరియు దేవతలు, సర్వమానవుల శాపం గురించిన దుర్వార్త కూడా వినిపించడం జరిగింది. దైవప్రవక్త(స) కూడా 'నా ఒక్క మాటైనా సరే ఇతరులకు అందించండి" అనే దైవప్రవక్త (స) వారి ఆదేశం, దైవాజ్ఞకు లోబడి ఉండడంలోనే నా శ్రేయం ఇమిడి వుంది. కాబట్టి నాకున్న పరిజ్ఞానం, ఎరుకమేరకు ఖుర్ఆన్ సందేశాన్ని వినిపించే సాహసం చేస్తున్నాను. ఆ ప్రయత్నం ఫలితంగానే మీ ముందు సమర్పిస్తున్న ఈ ఖుర్ఆన్ బోధనా పాఠం.

నీ ఈ దర్స్‌లో మీకు వ్యాకరణ సూత్రాల చిక్కుముడుల్నిగానీ, అవతరణకు సంబంధించిన ఉల్లేఖనాలుగానీ, ఫికహ్ మరియు వాణికి సంబంధించిన సమస్యలు, చర్చలుగానీ, తార్కిక ధృవీకరణలుగానీ ఏవీ అగుపడవు. వీటి ఉద్దేశ్యం కేవలం సందేశప్రచారం. అలాగే, హృదయాలకు జీవన సామగ్రిని అందించడం మరియు ఆచరణకు ఆహ్వానించడం మాత్రమే. అల్పజ్ఞానం, అల్పసామర్థ్యం ఉన్నప్పటికీ మేము ఖుర్ఆన్‌ను సులభగ్రాహ్యం చేశాము" అనే దైవవాక్యంపై నమ్మకమే దీనికి పునాది. మనసు ఇచ్చే పిలుపు ఇదే. ఫహల్ మిన్‌ముద్దక్కిర్. (తెలుసుకోగోరే వారు ఎవరైనా ఉన్నారా?)

సందేశప్రచారం మరియు జిహాద్ అంటే మానవాళిని సన్మార్గంపై నడిపేందుకు ఎడతెగని కృషి చేసేందుకు పిలుపు, ఇంకా, ప్రభువుని కలుసుకునే సమయంలో ఆయన ఆమోదం మరియు స్వర్గాల ఆకాంక్షయే ఖుర్ఆన్ ఇచ్చే సందేశం.

ఈ మార్గం సులభమూ ఉజ్వలమూ అయినదేకాక ప్రమాద

భూయిష్టం కూడాను. ఈ మార్గంపై నడవడానికి మనమూ అర్హులం కాగలం. కాని అలా కావడం కోసం ప్రక్షాళన, తర్ఫీదులు కావాలి. ఈ మార్గానికి ఇమామ్ (నాయకుని)గా తన ప్రియప్రవక్త(స)ను ఆ మార్గంలో నిలుపగానే దైవం ఆయన తర్ఫీదు కోసం అందజేసిన దారిబత్తెం నమాజ్, తహజ్జుద్, ఖుర్ఆన్ పారాయణం, దైవమార్గం వైపునకు పిలుపు, ఆయన నామస్మరణ, చిత్తశుద్ధి, సహనం, ఉత్తమ గుణగణాలు, ఇస్తిగ్ఫార్‌ల వంటి ప్రాథమిక ఆచరణలపై ఆధారపడిన సామగ్రియే. ఆయన ఒసగబడిన సందేశ ప్రచారం, జిహాద్‌ల మార్గంలోని అసలు పెట్టుబడి ఈ దారిబత్తెమే. ఇహపరాల సాఫల్యానికి పూచికత్తూ ఇదే.

ముజ్జమ్మిల్ సూరాలోని ఈ కొన్ని (1-11) ఆయత్‌లలో తర్ఫీదు యొక్క ఈ మొదటి మజిలీ గురించిన వివరణ ఉంది. ఈ ఆయత్‌లలో ఈ తర్ఫీదు యొక్క మొట్టమొదటి కోర్సునే పేర్కొనడం జరిగింది. దానినే మీకు అందించే ప్రయత్నం ఈ చిరుపుస్తకంలో చేశాను.

ఈ అల్ప ప్రయత్నాన్ని అల్లాహ్ ఆమోదించుగాక అని ప్రార్థిస్తున్నాను. నేను మాట్లాడే ఏ మాటనూ నాకు సమస్యగా చేయవద్దని "మీరు ఆచరించని దాని గురించి ఎందుకు మాట్లాడుతారు?" అనే దివ్యఖుర్ఆన్ ఆయత్ పరిధిలోకి ఈడ్వబడకుండా అల్లాహ్ నన్ను కాపాడుగాక! నాకు కావలసింది పాఠకుల పొగడ్తలూ ప్రశంసల జల్లులు కాదు. దైవసన్నిధిలో ఆమోద యోగ్యం కావాలన్నదే నా ఆకాంక్ష. అందుకోసం మీ ఆచరణ మరియు నా కోసం దుఆ మాత్రమే దానికి మార్గం. కాబట్టి నా రాత మీకు ప్రయోజనకరం అయితే నా అంతం విశ్వాసంతో కూడుకునేలా, నన్ను తన కారుణ్యంతో కప్పివేసేలా అల్లాహ్‌ను ప్రార్థించమని నా విజ్ఞప్తి.

ఖుర్రమ్ మురాద్
లాహోర్
7, రమజానుల్ ముబారక్, హిజ్రీ 1315
18, ఫిబ్రవరి 1994

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# శిక్షణకు తొలిమెట్టు

## అవతరణ నేపథ్యం

## వహీ (దైవవాణి) అవతరణారంభం

హజ్రత్ ఆయిషా(రజి) వివరిస్తున్నారు: "దైవప్రవక్త(స) హీరా కొండ గుహనుండి దిగి హజ్రత్ ఖదీజా(రజి) దగ్గరకు వచ్చారు. వస్తూవస్తూ 'ఇఖ్రా బిఇస్మి రబ్బికల్లజీ ఖలఖ్' (చదువు, నిన్ను పుట్టించిన ప్రభువు పేరుతో) అన్న దైవసందేశాన్ని వెంట తెచ్చారు. అప్పుడు ఆయన గుండెలు గడగడ లాడుతున్నాయి. పదిహేనేళ్ళుగా జీవిత భాగస్వామిగా ఉన్న ఆమెతో ఆయన (స) ఇలా పలికారు:

"నాకు దుప్పటి కప్పు, నాకు దుప్పటి కప్పు" అని.

ఆమె, ఆయన(స)పై దుప్పటిని కప్పారు. మనసు కాస్త స్థిమితపడ్డాక ఆమెకు జరిగినదంతా వివరించి తిరిగి ఇలా అన్నారు: "నాకు ప్రాణభయం కలుగుతోంది"అని. అత్యంత అంతరంగికురాలైన ఆయన(స)వారి భార్య, ఆయన(స)లోని సుగుణ సంపద ఎటువంటిదో బాగా ఎరిగినవారు. అందుచేత ఆమె ఊరడింపు కలిగించి చేయూతనివ్వడానికి ఆ సుగుణాల దుప్పటినే ఆయన(స)కు కప్పుతూ ఇలా అన్నారు: "లేదు, ఎంతమాత్రం

లేదు! అల్లాహ్ మిమ్మల్ని ఎన్నటికీ అవమానంపాలు చెయ్యడు. మీరు బంధువుల పట్ల సద్వ్యవహారణ పాటిస్తారు. సత్యం పలుకుతారు, నిస్సహా యులు, వికలాంగుల బరువు మోస్తారు. లేనివారికోసం సంపాది స్తారు. అతిధుల్ని గౌరవించి మర్యాదలు చేస్తారు. హక్కు విషయంలో సాధ్యమైనంత సహాయం చేస్తారు. (బుఖారీ)

## ప్రాణభయం ఎందుకు?

పవిత్ర హృదయంపై గ్రంథావతరణ జరగ్గానే ఆయన(స) ఎందుకు వణికిపోయారు, ఆయనకు తన ప్రాణం గురించిన భయం ఎందుకు పట్టుకుంది? ఎంతో ముఖ్యమయిన, సున్నితమయిన ప్రశ్న ఇది. కాని ఈ ప్రశ్నకు ఖచ్చితమయిన జవాబు దుర్లభం. నాకు తెలిసినంత మేరకు ఈ రహస్యపు జాడ ఖుర్ఆన్, హదీసులలో స్పష్టంగా లభించదు. శక్తి మంతుడు, అమానతుదారు అయిన జిబ్రీల్(అలై)ను చూసిన కారణంగానూ, అతడు ఆయన(స)ను పట్టుకుని కుదిపినందుకా? లేక భయం కలిగించిన ఈ సంఘటన ఆయనకు ఎన్నడూ అనుభవంలోకి రాని కొత్త సంఘటనా? ఈ కారణంగా భయంవేస్తే అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. ఒక మానవమాత్రుడి పైపడే ప్రభావాలన్నీ ప్రవక్త(స)పైనా పడవచ్చు. హజ్రత్ మూసా(అలై) కూడా చేతికర్ర కొండచిలువగా మారడం చూసి భయభ్రాంతులయ్యారు. బుఖారీ, ముస్లిమ్ గ్రంథాలలో హజ్రత్ జాబిర్(రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) కూడా "నేను దైవదూతను చూడగానే భయంతో నేలపై పడిపొయ్యాను" అని పలికారు.

మట్టితో చెయ్యబడిన మానవ హృదయం, అపరిమిత మైనవాడు, సర్వాంతర్యామి అయినవానితో సంభాషించినప్పుడు కంపించి పోవాల్సిందే గదా! ఎందుకంటే ఈ వాణి గొప్పతం గురించి ఖుర్ఆన్‌లో ఇలా చెప్ప

బడింది. "ఈ ఖుర్‌ఆన్‌ను గనక మేము ఏదైనా పర్వతంపై అవతరింపజేసివుంటే, అది అల్లాహ్‌పట్ల భయంతో అణిగిపోవడం, తునాతునకలు కావడాన్ని నీవు చూస్తావు" కనుక ముహమ్మద్(స) హృదయం కంపించడంలో ఆశ్చర్యమేముంది?

కాని 'ప్రాణభయం' కలిగిందీ అంటే అందుకు కారణం ఈ సంభాషణ, ప్రత్యక్షసాక్ష్యం తప్ప మరేమయినా ఉందా? ఈ ప్రవక్త పదవి, సందేశం, జిహాద్‌ల కార్యం అత్యంత బరువు బాధ్యతలుగల గురుతర కార్యం అని భావిస్తున్నాను. ఇందులో ప్రాణాలకు తెగించి పనిచేయవలసిన కఠిన దశలున్నాయి. ఆ భావనే హృదయాన్ని కంపింపచేయడమే కాక ప్రాణభయాన్ని కూడా కలిగించింది- ఆ భయం చివరకు హిజ్రత్‌నాటి రాత్రి వాస్తవరూపం దాల్చింది.

"నీ ప్రభువు పేరుతో పఠించు" అన్న ముక్తసరి పదాలలో రాబోయే దశలన్నింటి రూపం తొంగిచూస్తోంది. పఠించు లేక వినిపించు అంటే ఈనాటిలాగా ఖుర్‌ఆన్ ఆ రోజుల్లో పుస్తకరూపంలో వుండలేదు. నీ ప్రభువు నీ నోట పలికించిన దానిని వినిపించు. మానవులను సంబోధించు! అంటే ఆయన ప్రవక్తగా ప్రభవింపచేయబడి వచ్చానని ప్రకటించు. సృష్టికర్త, ప్రభువు, విజ్ఞానఖని వైపుకు ఆహ్వానించు. ఏకాకిగా ఒంటరిగా నిలబడడం, విశ్వసృష్టికర్త ప్రతినిధినని చెప్పుకోవడం, ప్రజలు విన్నా, వినకపోయినా అంగీకరించినా, తిరస్కరించినా, ఎట్టిపరిస్థితులలోనూ నీవు సహనంతో సందేశ ప్రచారం చేస్తూ వుండటం, చీకట్లలో చిరుదివ్వె వెలిగించడం వగైరా పనులన్నీ వర్ఖా బిన్ నౌఫిల్ తెలుపకపోయి ఉన్నప్పటికీ ఆయన(స)కు ఈ పనులన్నీ ప్రాణాలు తోడేసే పనులని భావించడం అంత కష్టం కాదు. షిర్క్ (బహుదైవారాధన) కుఫ్ర్ (తిరస్కారం) హింసా దౌర్జన్యాల గాఢాంధ

కారం, మక్కా, తాయెఫ్ సర్దారుల వ్యతిరేకత, అభిశంసన, ప్రజా సామాన్యంలో తిష్ట వేసుకున్న అజ్ఞానం- ఇంకా ఆయన(స) నుండి దాచబడి వుంచేది మరేమయినా ఉందా?

కొద్ది వ్యవధి తర్వాత అల్లాహ్ ఆయనతో సంభాషించినప్పుడు విషయాన్ని తేటతెల్లం చేశాడు. "లేచి నిలబడు, అందర్నీ మేల్కొలుపు, నీ ప్రభువుకన్నా గొప్పవాడు ఎవడూ లేడని హెచ్చరించు. ఆయన ఘనతను చాటిచెప్పు. ఆయన ఘనతను స్థాపించు. నీ శరీరాన్ని మనస్సును పవిత్రం చెయ్యి. షిర్క్‌కు సంబంధించిన ప్రతి మాలిన్యానికీ దూరంగా ఉండు. నీకు ఎక్కువ పని ఇవ్వబడిందని భావించకు. ప్రజలు ఒప్పుకొన్న తర్వాత కూడా తిరస్కరిస్తే అప్పటికీ సహనంతో నీ పనిలో నిమగ్నుడవయిపో."

*(అల్ ముద్దసిర్ 74: 1-6)*

ప్రమాదభూయిష్టమైన ఈ గొప్పకార్యం, జాతిపరిస్థితిని చూసి ఆయన(స) గడగడలాడారంటే, వెనుకంజ వేసారంటే, ఆందోళనకు గురయ్యారంటే, చింతాక్రాంతులయ్యారంటే, జాతిప్రజలను గురించి ఆలోచిస్తూ అసహనంతో దిగులు చెందారంటే దుప్పటితో కప్పబడాలని కోరుకుంటే ఇది పూర్తిగా మానవ స్వభావానికి అనుగుణంగా వున్న విషయమే. దైవకారుణ్యం కోరుతుందీ దీనినే. అల్లాహ్ తన ఆదరణా పూర్వక హస్తాన్ని ముందుకు చాపుతున్నాడు. ఆయన(స)కు ప్రేమాలాలిత్యాలతో ఆశ్రయం ఇస్తున్నాడు. ఆయన(స) అంతర్గత పరిస్థితికి చికిత్సను సూచిస్తున్నాడు. ఆయన(స)కు ఎదురుకానున్న ఓర్పును పరీక్షించే దశల కోసం దారిబత్తెం లేక టూల్‌కిట్ ప్రసాదిస్తున్నాడు. అందుచేత ముజ్జమ్మిల్ సూరా ధర్మమార్గపు మొదటి మజిలీ కోసం కరదీపికగా అవతరించబడింది. ఈ మజిలీలో ఆయన(స)కు అవసరమయినదంతా అనుగ్రహించబడింది.

## అవతరణా కాలం

ముజ్జమ్మిల్ సూరా బొత్తిగా ఆరంభకాలంలోని సూరాలలోనిది. కొన్ని ఉల్లేఖనాల ప్రకారం మూడవ లేక నాలుగవ వహీ (దైవసందేశం) కాని ఈ వాణిని బట్టి. ఈ సూరా, ఆయన(స) తహజ్జుద్‌లో పఠించగలిగినంత పరిమాణంలో ఆయన(స)పై అవతరించబడి వున్నకాలంలో అవతరించబడి వుండవచ్చని అర్థమవుతోంది. ఆయన(స) పగలంతా దైవంవైపుకు పిలుపునిచ్చే కార్యంలో నిమగ్నులయ్యి ఉండడం కారణంగా చెప్పుకోదగ్గ స్థాయిలో వ్యతిరేకత కూడా ఆరంభమయి వుండవచ్చు. అంటే ఇది ప్రజాస్థాయిలో బహిరంగ సందేశ ప్రచారానికి ఆరంభం కావచ్చు.

## అవతరణా కారణం

ఈ సూరా అవతరణకు నేపథ్యం స్వయంగా ఆయనే(స) అనవచ్చు. ఆయన(స) కలత, చింత, అశాంతి, విచారం, ఆందోళనలతో కూడిన అంతర్గత మానసిక స్థితి, ఆయన(స)కు ప్రవక్త పదవీ నిర్వహణలో అనుభవపూర్వకంగా ఎదురయిన పరిస్థితి అది. ఈ కార్యనిర్వహణ కోసం ఆయన(స)కు కావలసినవి: సాంత్వన, సానుభూతి, శాంతి, తోడ్పాటు, ప్రేమాధరణలు, అనుగ్రహం, మనోనిబ్బరం, నిలకడ, ప్రోత్సాహం, ధైర్యం, శక్తి, సహనం, సృష్టికర్త మరియు సృష్టికర్తతో వీలయినంత అనుసంధానం- ఇదీ స్వస్థతా ఫార్ములా, ఇదీ దారిబత్తెం, చద్దిమూట.

ఈ సూరా అవతరణకు కారణం ఏదో ఒక స్థాయిలో మీరూ మేము కూడాను. ఎందుకంటే మనం ముస్లిములం. ఉమ్మతె ముస్లిమా (ముస్లిం అనుచర సమాజం)లో చేరివున్న ప్రతివ్యక్తిపైనా, దైవప్రవక్త(స)పై మోపబడిన విధంగానే, సాక్ష్యం, సందేశం, జిహాద్‌ల బాధ్యత మోపబడుతోంది. తమ తమ పరిధిలో తమ తమ స్తోమత మేరకు "దైవప్రవక్త మీ

విషయంలో సాక్షిగా ఉండటానికీ మరియు మీరు ప్రజల విషయంలో సాక్షులుగా ఉండటానికీ" (అల్‌హజ్: 22-78). దైవప్రవక్తను అనుసరించే వానిగా ప్రకటించుకునే ప్రతివాడూ, దైవప్రవక్త(స) జీవితాంతం ఎల్లవేళలా దేన్నయితే నిర్వర్తిస్తూ వచ్చారో ఆ పనినే అందరికంటే ముందుగా చేయవలసి ఉంటుంది.

మీకేగనక అల్లాహ్ తన కారుణ్యంతో ఒక ముస్లింగా మీ ఈ బాధ్యత గురించిన స్పృహ కలిగించివుంటే, ఆయన(స) మార్గం అయిన సందేశం, జిహాద్‌ల మార్గంలో మీరు వచ్చి నిలబడివుంటే, ఈ సూరా మీకోసమే అవతరించబడినదిగా మిమ్మల్ని సంబోధిస్తున్నదిగా మీరు గ్రహించగలరు. మీ పరిస్థితి, మీ అవసరాలు, దీని అవతరణా కారణాలు, దైవప్రవక్త(స)కు ఎదురయిన అంతర్గత పరిస్థితులు ఏదో ఒక స్థాయిలో మీకు ఎదురుపడ వచ్చు. అందుకు చికిత్స ముజ్జమ్మిల్ సూరాయే. దైవప్రవక్త(స) తాము దాటుకుంటూపోయిన దశల్ని మీరు కూడా ఏదో ఒక విధంగా దాటగలరు. ఈ దశలన్నింటినీ విజయవంతంగా దాటుకుపోవటానికి అవసరమైన టూల్‌కిట్ కూడా ముజ్జమ్మిల్ సూరాయే.

## మనోజ్ఞమైన సంభోదన

"ఓ దుప్పటి చుట్టుకున్నవాడా!"

ఈ సంబోధన మనోజ్ఞమైనదే కాక చిక్కుముడుల్ని విప్పే, సంతృప్తి, నిలకడల సామగ్రి కూడాను. స్వస్థతకు ఫార్ములా కూడా. మనస్సులో గూడుకట్టుకున్న పరిస్థితుల సూచిక కూడా ఇదే. సందేశం, జిహాద్ దశల చిహ్నం కూడా. అది ఒకే ఒక పదంపై ఆధారపడినదైనాసరే.

ఆయన(స) హిరా కొండ గుహ నుండి దిగివచ్చినప్పుడు మొదట

ఈ పదాలే ఆయన నోట వెలువడ్డాయి: "నాకు దుప్పటి కప్పు" అల్లాహ్ చేసిన ఈ సంబోధన ఆయన(స) మాటలలోనే ఎందుకున్నట్లు?

దుప్పటి అరేబియా వారిలోనే కాక ప్రపంచం మొత్తంలో సుప్రసిద్ధ మయినదీ, ఇష్టకరమైనదీ అయిన దుస్తుల్లోని భాగం. డిజైన్, కటింగ్, కుట్టు ఏమీలేకుండా సీదాసాదాగా ఉండే వస్త్రం. కాని అరబ్‌వాసులు ఎవరిపైనైనా తమ ప్రేమాభిమానాలు, మర్యాదా మన్ననల్ని వెల్లడించవలసిన వచ్చి నప్పుడు సంబోధించబడేవాడు ఎటువంటి రూపురేఖలతో బయటికి కనిపిస్తాడో అవే రూపురేఖలను బట్టి అతనిని సంబోధించడం వారి పద్ధతి. దైవప్రవక్త(స) హజ్రత్ అలీ(ర)ను అబూతురాబ్ అని పిలిచినట్లుగా.

దైవప్రవక్త(స) తన ప్రభువు అప్పగించిన పనిని నిర్వర్తించడానికి బయటకు వెళ్ళేటప్పుడు దుప్పటి ధరించేవారు. రాత్రిళ్ళు నమాజ్‌కోసం నిలబడినప్పుడు దుప్పటిని మడిచేసేవారు. బయటి వ్యతిరేకతలు, అంతర్గత పరిస్థితులు ఒక్కసారిగా చుట్టుముట్టినప్పుడు దుప్పటి కప్పుకోవడానికి దుప్పటి అంచులో ముఖం దాచుకోగోరేవారు. ఏ పరిస్థితి అయినా ప్రభువు తరఫునుండి ప్రేమ, మన్ననలు పొందగోరితే దుప్పటి కప్పుకునేవారు. ప్రభువు తరఫునుండి ఓ దుప్పటి కప్పుకున్నవాడా! అన్న ప్రేమపూర్వక సంబోధన, ఆయన జోలెను ప్రేమ, మన్ననలతో నింపివేయడం కోసమే.

దుప్పటి కేవలం బాహ్యరూపాన్నే కాక అంతర్గత పరిస్థితులను కూడా వెల్లడిస్తుంది. పరిస్థితులు అనుకూలించనప్పుడు, పనిభారం తాహతుకు మించిపోయినప్పుడు, కష్టాలు అదుపు తప్పినప్పుడు, మనిషి కాళరాత్రిన ఒక్కడే మేల్కొని, అందర్నీ మేల్కొలుపుతున్నప్పటికీ, నిద్రమత్తులో తన కళ్ళు తెరిచే ప్రయత్నం చెయ్యనందువల్ల అతడి ఏకాంత స్థితి మరీ సుదీర్ఘమైపోతుంది. సత్యం పట్టపగలులా అతడికి కనబడుతూ

వున్నా, ప్రజలు దాన్ని తిరస్కరించడానికే నిర్ణయించుకున్నప్పుడు, దుప్పటి కప్పుకొని, ముఖాన్ని చుట్టేసుకొని పడుకొనే బలీయమైన కోరిక ఎవరికి పట్టదు గనుక?

దైవప్రవక్త(స)కు సందేశ ప్రచారం అనే అతి గొప్ప కార్యంలో దుఃఖం, విచారం, చింతాక్రాంతం అయ్యే ఎటువంటి పరిస్థితి ఎదురయ్యేది?

ఆయన (స) దైవప్రవక్తఅని, ఖుర్‌ఆన్ దైవవాణి అని తిరస్కరించే వారు. ఆయన(స) పరిస్థితి ఎలా వుండేదంటే ఆయన పగలును, పగలు అని అంటూవుంటే వింటున్నవారు, చూస్తున్నవారు దానిని రాత్రి అనడానికి పట్టుబడుతున్నారు. ప్రజలందరూ విశ్వసించాలని ఆయన మనస్సు కోరుతూవుంటే వారు దానిని తిరస్కరించడానికే సిద్ధపడుతున్నారు. జాతిని ఉపద్రవం చుట్టుముడుతూ ఉంటే వారు ఏమరుపాటు, అలక్ష్యం ప్రదర్శించేవారు. అంతేకాదు జాతి సర్దార్లు ఆయన(స) పై, ఆయన అనుచరులపై దౌర్జన్యం, బలప్రయోగం అధికం చేశారు. ఇటువంటి పరిస్థితులలో ఆయన(స) చింతాక్రాంతులయి, దిగులుగా ఉండటం ఒక సహజమైన విషయమే. దిగులు, విచారం కమ్ముకున్నప్పుడు మనిషికి దుప్పటే దుఃఖాన్ని పోగొట్టే ఉత్తమ సాధనం.

ఆయన(స) ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ ప్రజల శత్రుత్వం, తిరస్కారం పెరుగుతూపోతుంటే, నా లోని లోపం ఇందుకు కారణమా?, శ్రమించే హక్కు నెరవేరడం లేదా? వివేచనలో, నైతికతల విషయంలో నా ప్రమాణం కావలసిన ప్రమాణానికి దిగువన లేదుకదా అన్న సందేహం ఆయన(స)కు కలిగేది. అందుచేతనే ఆయన(స) పగలు వందేసి సార్లు ఇస్తిగ్‌ఫార్ (మన్నింపు దుఆ) చేసేవారు.

ఇటువంటి పరిస్థితులలో దుప్పటి కప్పుకున్నవాడా అన్న ప్రేమ భరిత సంబోధన, కారుణ్యం, అనురాగాల వీచిక, ఒక ప్రేమ సందేశం

అయింది. ఆయనకు స్వాంతన, ఊరడింపుల సాధనం అయింది. ఆయన కోసం దైవదాస్యం మరియు సందేశప్రదానం, జిహాద్‌ల తయారీకి అవసరమైన ఆత్మప్రక్షాళనా మార్గం అవలంబించడం సులభం అయింది. ఈ సూరా ఆయన(స) కోసం ఈ మార్గాన్నే తెరుస్తూంది.

## రాత్రి నిలబడటం (తహజ్జుద్)

అల్లాహ్ దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా సెలవిచ్చాడు:

"రాత్రిళ్ళు నిలబడుతూ వుండు (నమాజ్‌లో) కొంతభాగంలో తప్ప. అంటే అర్ధరాత్రి లేదా అంతకన్నా కొంచెం తక్కువగానీ, కొంచెం ఎక్కువగానీ రాత్రి నిలబడు. నమాజ్ చెయ్యి." ఇది ఈ మార్గంలోని తొలిమెట్టు. ఇది మొదటి హితోపదేశం, అతి ముఖ్య ఉపదేశం కూడా. రాత్రి నమాజ్ చేయడం ద్వారానే అల్లాహ్ మార్గంలో నడిచేందుకు అవసరమయిన శక్తి, అల్లాహ్ మార్గంలో బయలుదేరడం లాంటి సుగుణాలు, మేళ్ళు జనించ గలవు.

## మనమూ సంబోధితులమే

అందుచేతనే అల్లాహ్ తన ప్రవక్త(స)కు ఈ హితోపదేశం చేశాడు. దీని సంబోధితులు ఆయన (స) గారి సందేశాన్ని స్వీకరించి ఆయనకు తోడ్పడుతున్నవారు కూడాను. ఆయన ప్రత్యక్ష స్వరూపం, అప్పటి పరిస్థితుల ప్రకారం ఈ సంబోధన కేవలం ఆయన(స)ను ఉద్దేశించి చేయబడినదే అయినప్పటికీ సూరాలోని చివరి ఆయత్‌లు, ఆయన(స) అనుచరులు కూడా ఈ ఆదేశాన్ని అమలుపర్చడంలో రాత్రిళ్ళు నమాజ్ కోసం నిలబడేవారని తెలుపుతున్నాయి. అందుచేత ఇది వారందరినీ సంబోధిస్తోంది. ఆయన(స) తర్వాత ఆయన(స)అడుగుజాడల్లో నడవవలసి ఉంటుంది. ఆయన(స) తర్వాత ఆయన(స) ఉమ్మత్‌కు అప్పగించబడిన

దైవసందేశ ప్రచార కార్యాన్ని నిర్వర్తించడానికి నడుంకట్టినవారు ప్రత్యేకించి ఈ భారాన్ని తమ భుజస్కంధాలపై వేసుకోవాలి.

రాత్రి పూట నిలబడటం దేనికి? దాని అవసరం ఎందుకు? దీనివలన దక్కేది ఏమిటి? అదంతా స్వయంగా ఖుర్‌ఆన్ ఇప్పుడే మీకు తేటతెల్లం చేస్తోంది చూడండి!

## ఎంత రాత్రి వరకు?

రాత్రిలో ఎంత సేపు నిలబడమని బోధించబడింది అన్న విషయం గమనించాలి. సగం రాత్రి అని అరబీ పదాలు తెలియజేస్తున్నాయి. కాని ఇంతకంటే ఎక్కువ భాగంలోనూ చేయవచ్చు. ఇంతకంటే తక్కువ భాగంలోనూ చేయవచ్చు. పరిమాణంలో ఈ సౌకర్యం ఉంచడానికి కారణం రాత్రి లేచి నమాజ్ చేయటమే చాలా కష్టమైన పని. అందరి కోసమూ ఒకే పరిమాణం అన్న నిబంధన సాధ్యంకాదు. ఇక రోజూ సగం రాత్రి అన్న నిబంధన పెడితే మరింత కష్టమవుతుంది. ఈ సౌకర్యం ఉంచడానికి మరో కారణం కూడా ఉంది. పరిమాణానికి సంబంధించి రాత్రిపూట లెక్క ఉంచడం దుస్సాధ్యం. ప్రత్యేకించి పడుకుని లేవడం అయితే మరీను. కాని వీలుపడనివారు ఈ పదాలను అనుసరించి అందుకోసం సగం రాత్రి వేళలో నమాజ్ చేయడమే ప్రాథమికం.

మానవుని పరిస్థితులు, అవసరాలు మరియు బలహీనతల్ని దృష్టిలో వుంచుకొని ఈ సౌకర్యాలు కలిగించడం ధార్మిక వివేచనలోని ఒక గొప్ప, ముఖ్య సూత్రం. ఈ సూత్రమే ఇక్కడ స్పష్టమవుతోంది. ఇది గుప్పెడు మంది ఎంపిక చేయబడినవారు ఆయన(స) వెంట ఉన్నప్పటి సంగతి. ఆ తరువాత ఉమ్మత్ పరిధి విస్తృతం అయ్యేకాలం సమీపించగానే రాత్రి నిలబడటానికి బదులు పగలు ఐదు పూటలు నమాజ్ చేయమని

ఆదేశించబడటాన్ని మీరు గమనిస్తారు. ఇంకా ఆ నమాజ్‌ల పరిమాణం, వాటి వేళలు కూడా నిర్ణయించబడ్డాయి. అర్ధరాత్రి నమాజ్‌లో ఖుర్‌ఆన్ పారాయణం చేసే బదులు ఎంతమేరకు ఖుర్‌ఆన్‌ను సులభంగా పఠించగలిగితే అంతమేరకు పఠించండి" అన్న సౌకర్యం కలిగించబడింది. మరింత కారుణ్యం ఏమంటే, ఫజ్ర్ మరియు ఇషాలలోని సామూహిక (జమాఅత్‌తో) నమాజులకు పూర్తి రాత్రి నిలబడినందువల్ల కలిగే పుణ్యఫలం లభిస్తుంది అన్న వాగ్దానం చెయ్యబడింది.

## రాత్రి ఏ సమయంలో?

రాత్రి ఏ భాగంలో నిలబడాలి? ఖుర్‌ఆన్ బోధన ప్రకారం, మనిషి నిద్రించిన తర్వాత లేచినప్పుడు అదే సమయం బాగా సముచితం. ఎందుకంటే ఇలా నిలబడటాన్ని "నాషియతల్లయ్‌ల్" (రాత్రి లేవటం) అని చెప్పబడింది. అంటే రాత్రి చివరి భాగం అనే విషయమూ దివ్యఖుర్‌ఆన్, ఇతర చోట్ల కూడా ఇదే సమయాన్ని సూచించింది.

"రాత్రి వారు తక్కువగానే నిద్రించేవారు. ప్రాతఃకాల వేళలో ఇస్తిగ్‌ఫార్ (మన్నింపు దుఆ) చేసేవారు." (అజ్ జారియాత్: 17, 18)

"ఎందుకంటే ఫజ్ర్ సమయంలో ఖుర్‌ఆన్ సాక్ష్యం ఇచ్చేదవుతుంది. ఇంకా రాత్రి తహజ్జుద్ నమాజ్ చెయ్యండి. ఇది మీకు నఫిల్ కార్యం." (బనీ ఇస్రాయీల్- 78, 79)

దైవప్రవక్త(స) కూడా సర్వసాధారణంగా రాత్రి చివరిభాగంలోనే ఖియాం చేసేవారు (అంటే నిలబడి నమాజు చేసేవారు). హజ్రత్ ఆయిషా (రజి) ఇలా తెలియజేస్తున్నారు: "దైవప్రవక్త రాత్రి ఆరంభకాలంలో నిద్రించే వారు. రాత్రి ఆఖరిభాగంలో మేల్కొనేవారు. హజ్రత్ మస్రూఖ్(రజి)కు ఆమె ఇలా తెలిపారు: "కోడికూత సమయానికి ఆయన(స) మేల్కొనేవారు."

(బుఖారీ, ముస్లిం) హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) ఒక రాత్రి తన పిన్నమ్మ మరియు దైవప్రవక్త(స) సతీమణి అయిన హజ్రత్ మైమూనా (రజి) ఇంట బసచేశారు. ఆయన ఇలా వివరిస్తున్నారు: "ఆయన(స) కాస్సేపు తన భార్యతో ముచ్చటించారు. తర్వాత నిద్రించారు. రాత్రి చివరి మూడవ ఝామున లేక అంతకన్నా కొంచెం తక్కువ సమయం మిగిలి ఉండగా ఆయన(స) నమాజ్ కోసం లేచారు." (బుఖారీ)

హజ్రత్ ఆయిషా(రజి) ఉల్లేఖనం ద్వారా మరో విషయం కూడా తెలుస్తోంది. ఆయన(స) కొన్ని సందర్భాలలో ఇషా మరియు ఫజ్ర్‌ల మధ్య (ఏ సమయంలోనైనా) తహజ్జుద్ నమాజ్ చేసుకునేవారు. (బుఖారీ, ముస్లిం)

"అల్లాహ్ ఆయన(స)ను తాను కోరుకున్నప్పుడు మేల్కొలుపు తాడు" అని కూడా ఆమె అన్నారు.

హజ్రత్ ఆయిషా(ర)ఇలా కూడా చెప్పడం జరిగింది: ఆయన(స) రాత్రి ప్రతి భాగంలోనూ వితర్ నమాజ్ చేశారు. రాత్రి ఆరంభంలో, మధ్యలో మరియు చివరలో. కొన్ని ఉల్లేఖనాల ద్వారా ఆయన(స) రాత్రి పలుమార్లు లేచి కూడా నమాజ్ చేసేవారని రుజువవుతోంది. అంటే, లేచేవారు, నమాజ్ చేసేవారు, తిరిగి నిద్రించేవారు. మరలా లేచేవారు. ఆయన(సల్లం) లేవడం, మిస్వాక్ చేయడం, ఉజూ చేయడం తిరిగి రెండు రకాత్‌లు నమాజ్ చేయడం, తిరిగి ఆయన(సల్లం) నిద్రించడం, గురకలు కూడా పెట్టడం, మూడుసార్లు ఇలా చేయడం, మొత్తం ఆరు రకాత్‌లు చేయడం హజ్రత్ ఇబ్నె అబ్బాస్(రజి) చూశారు. (ముస్లిం, మాలిక్, అబూదావూద్) హజ్రత్ హమీద్(రజి) ఒక ప్రయాణంలో ఇలాగే చేశారని ఉల్లేఖించారు. (నసాయి)

అర్థరాత్రి తర్వాత సమయమే ఉత్తమం. కాని ఉమ్మత్ సౌకర్యం కోసం తమ స్తోమత ప్రకారం ఏ సమయంలోనయినా చేసే అవకాశం దైవప్రవక్త(స) కల్పించారు.

# ఖుర్ఆన్ పఠనం (పారాయణం)

## రాత్రి నిలబడటం ఎందుకు?

"ఇంకా ఖుర్ఆన్‌ను బాగా ఆగి ఆగి పఠించండి" (ఖుర్ఆన్)

ఖుర్ఆన్ కోసం నమాజ్‌లో రుకూలు, సజ్‌దాలు, తక్బీర్, తస్బీహ్ అన్నీ చేరివున్నప్పటికీ, రాత్రి నిలబడటం యొక్క అసలు ఉద్దేశం ఇదే. ఖుర్ఆన్ సహచర్యంలో రాత్రి ప్రశాంత ఘడియల్ని గడపటానికి, ఖుర్ఆన్‌లో లీనం కావడానికి, ఖుర్ఆన్ పఠనంతో నాలుకను తడిగా ఉంచుకోవడానికి, ఖుర్ఆన్‌ను మనోమస్తిష్కాల ఆహారంగా చెయ్యడానికి. ఇంకా ఖుర్ఆన్‌ను ప్రసాదించినవాని, అది ఎవరి వాణియో అతడి సమక్షంలో హాజరయి పఠించడానికీ, వినడానికీను.

## ఖుర్ఆన్ ఎందుకు?

ప్రచారం, దైవదౌత్య భారం అంటే ఖుర్ఆన్‌నే అందజేసే భారం. సత్యసాక్ష్యం ఇచ్చే బాధ్యత అంటే ఖుర్ఆన్‌పైనే సాక్ష్యం ఇచ్చే బాధ్యత. ధర్మసంస్థాపనా గమ్యం అంటే ఖుర్ఆన్‌నే సంస్థాపించే గమ్యం. ఎవరైనా ఇందులోని ఏ పని అయినా ఏ స్థాయిలో అయినా చేయవలసి ఉంటే అతడు అన్నింటికన్నా ముందు ఖుర్ఆన్‌ను తెలుసుకోవాలి. అర్థం చేసుకోవాలి. దానికి చేరువకావాలి. తన హృదయాన్ని దానికి నివాసస్థానంగా చేయాలి. ఈ స్థానం రాత్రి ఏకాంతంలో ప్రశాంతతలో తన ప్రభువు

సమక్షంలో నిలబడి ఖుర్‌ఆన్ ఆయత్‌ల పఠనం ద్వారానే పొందగలం. సందేశం, జిహాద్ కోరేవాడు ఖుర్‌ఆన్‌ను అభిమానించేవాడు కానట్లయితే అతనికి ఖుర్‌ఆన్ కోసమే సమయం లేకపోతే, అతడు ఈ గొప్ప కార్యాలను సక్రమంగా ఎలా నిర్వహించగలడు? ఆ పనుల వాస్తవికతను ఎలా తెలుసుకోగలడు? వాటికి తన హృదయంలో చోటెలా ఇవ్వగలుగుతాడు? అందుకోసం అతను సమయాన్ని ఎలా కేటాయించుకోగలడు?

దాని సందేశం, ఆహ్వానం ఏమిటో ఖుర్‌ఆన్‌యే మీకు వివరిస్తుంది. దాని ఆదేశాలు ఏవి? దాని మార్గంపై నడిచే విధానాలు ఏవి? అల్లాహ్‌ను ఆయన ప్రవక్త(స)ను, వారిపై విశ్వాసాన్ని, అది మోపే బాధ్యతల్ని, మీ కోసం అన్నింటికన్నా ప్రియతమం చేస్తుంది ఖుర్‌ఆన్. వాటిని మనసులో వశింప జేస్తుంది. బలీయం చేస్తుంది. మీ హృదయంలో అలంకరింపజేస్తుంది. తిరస్కారాన్ని, ధర్మరాహిత్యాన్ని, అవిధేయతని మీకు కటువయినదిగా, సహించరానిదిగా చేస్తుంది. ఖుర్‌ఆన్ గ్రంథమే మీకోసం ఆచరణ, తీవ్రకృషి చేసే మార్గాలను తెరుస్తుంది. ఇంకా అందుకు స్తోమతనూ పుట్టిస్తుంది. ఆదినుండి అంతం వరకూ ఆచరణ వైపుకు ఆహ్వానించడానికే వచ్చింది ఖుర్‌ఆన్. తర్కం మరియు ఫికహ్ చర్చలను ప్రక్కనబెట్టి చూస్తే విశ్వాసం వైపున ఆహ్వానించే ఆహ్వానం ఆచరణ వైపుకు పిలవడం. ఆచరణ కోసం తఖ్వా కావాలి. అగోచర జ్ఞానంపై విశ్వాసం అవసరం. పునాదుల అవసరం వుంది. అంతస్తుల వారీగా కట్టడాన్ని నిర్మించవలసిన అవసరం ఉంది. ఈ అవసరాలన్నింటినీ ఖుర్‌ఆన్‌యే పూర్తి చేస్తుంది. ఖుర్‌ఆన్ మీలో దృఢనిశ్చ యాన్నీ, ఉద్దేశాన్నీ జనింపజేస్తుంది. ధైర్యాన్ని, ఉత్సాహాన్ని పెంపొందింప జేస్తుంది.

ఖుర్‌ఆన్‌యే మీకు దైవోపదేశాన్ని, ప్రచారం మరియు ధర్మ సంస్థాపనా గ్రంథమే మార్గాన్నీ చూపుతుంది. దాని దశల్ని, మజిలీలను

తెలియజేస్తుంది. దాని హద్దులు, గుర్తుల్ని స్పష్టం చేస్తుంది. అదిచూపిన విప్లవ విధానంపై నడుస్తూ సిద్ధాంతాల హద్దులలో తమ గమ్యంవైపు పురోగమించగల ఉపాయాలనూ సూచిస్తుంది. ఖుర్‌ఆన్ యొక్క సందేశ ప్రచార విధానం, వాగ్ధోరణి, సాక్షీకరణ విధానం, మీకు గొప్ప మార్గదర్శి కాగలవు. తప్పొప్పుల మధ్య తేడాను, విచక్షణ చేసేందుకు అది మీ హృదయంలో మీ దృష్టి కళ్ళెదుట గీటురాయిని ఉంచుతుంది, త్రాసును వ్రేలాడదీస్తుంది.

ఖుర్‌ఆన్ మాత్రమే మీకు సంతుష్టిని కలిగిస్తుంది. మీకు ఆసరా అవుతుంది. మీకు సానుభూతి లభిస్తుంది. దుఃఖం విచారాలను పోగొట్టేదిగా అవుతుంది. భయాన్ని పోగొడుతుంది. కష్టాలు సంభవిస్తే చేయి అందిస్తుంది. చిక్కుల్ని విడదీస్తుంది. విచారాలూ, కష్టాలలో ఉపాయం చూపుతుంది. అది మీ జీవన మిత్ర అవుతుంది. మనస్సుకు శాంతినిస్తూ మీవెంటే ఉంటుంది. 'అలా బిజిక్రిల్లాహి తత్మఇన్నుల్ ఖులూబ్' నిశ్చయంగా దైవస్మరణ ద్వారానే మనసులకు స్వాంతన లభిస్తుంది. ఖుర్‌ఆన్‌ను మించి అల్లాహ్ స్మరణకు సాధనం మరెక్కడుంది?

## ఆగి ఆగి నింపాదిగా ఖుర్‌ఆన్‌ను పఠించడం

ఖుర్‌ఆన్‌ను నింపాదిగా ఆగి ఆగి పఠించాలని బోధించడం జరిగింది. ఆగి ఆగి పఠించడం అంటే, రాగిబ్ అస్ఫహాని' అభిప్రాయం ప్రకారం ఖుర్‌ఆన్ ఆయత్‌లను సౌకర్యంతో తగు నిష్పత్తిలో పఠించడం. దివ్యఖుర్‌ఆన్ అనువాదకులందరి అభిప్రాయంలో తర్తీల్ అంటే బాగా ఆగి ఆగి పఠించడం. (సయ్యద్ మౌదూదీ (రహ్మాలై) అనువాదం) విడమర్చి స్పష్టంగా పలకండి అని, ('షేఖుల్ హింద్ (రహ్మాలై) అనువాదం), బాగా స్పష్టంగా ఒక్కొక్క అక్షరం వేరుగా వుండేలా పఠించండి' (మౌలానా థాన్వీ

(రహ్మాలై) అనువాదం) ఖుర్‌ఆన్ పఠనం గబగబా చేయకూడదనీ, ఆగి ఆగి సులభంగా పలకాలి. దాంతోపాటు దాని అర్థాన్ని గురించి దీర్ఘంగా ఆలోచించాలి అని ఖర్తబా అనువదిస్తున్నారు.

తర్తీల్ అర్థం పూర్తిగా నిఘంటువు మరియు వ్యాఖ్యానంతో అర్థమయ్యేది కాదు. ఇందుకోసం ఖుర్‌ఆన్‌ను పొందిన ప్రవక్త(స) తర్తీల్ ఎలాంటిదో చూడాలి. అప్పుడు విషయం పూర్తిగా అర్థమవుతుంది. దాని రూపం కూడా కళ్ళెదుట సాక్షాత్కరిస్తుంది.

హజ్రత్ హుజైఫా బిన్ యమాన్(రజి) ఇలా తెలియజేస్తున్నారు: "ఒకసారి రాత్రి నమాజ్‌లో దైవప్రవక్త(స) వెంట నిలబడ్డాను. ఆయన(సల్లం) పఠనా విధానం గమనించాను. తస్బీహ్ సందర్భం వచ్చినప్పుడు తస్బీహ్ పఠించేవారు. దుఆ సందర్భం వచ్చినచోట దుఆ చేసేవారు. అల్లాహ్ శరణు వేడే సందర్భం వచ్చినప్పుడు శరణు కోరేవారు." (ముస్లిం, నసాయి)

హజ్రత్ ఔఫ్(రజి) బిన్ మాలిక్ ఉల్లేఖనం ఇలా ఉంది: "ఓ రాత్రి నేను దైవప్రవక్త(సల్లం)తోపాటు నమాజ్‌లో నిలబడ్డాను. ఆయన(స) బఖరా సూరా ఎలా పఠించారంటే, ఏదైనా కారుణ్యానికి సంబంధించిన ఆయత్ పఠించేటప్పుడు ఆపి, అర్థించేవారు. శిక్ష, యాతనల ఆయత్ పఠించే టప్పుడు ఆగి శరణుకోరేవారు." (అబూదావూద్, నసాయి)

దైవప్రవక్త(స) వారి ఖిరాఅత్ విధానం ఎలాగుండేది? అని హజ్రత్ అనస్(రజి)ను అడిగినప్పుడు, ఆయన(సల్లం) సాగదీసి పఠించేవారు; తర్వాత బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీంను పఠించి చూపారు. అందులో అల్లాహ్‌ను, అర్రహ్మాన్‌ను, అర్రహీంను సాగదీసి మరీ పఠించారు. అని అన్నారు. (బుఖారీ)

హజ్రత్ ఉమ్మెసల్మా(రజి) వివరణ ఇలా ఉంది: "దైవప్రవక్త(స)

ఒక్కొక్క భాగాన్ని వేరుగా పఠించేవారు. అల్‌హందులిల్లాహి రబ్బిల్ ఆలమీన్ పఠించి ఆగిపోయేవారు. తర్వాత అర్రహ్మానిర్రహీం పఠించేవారు మరల ఆగిపోయేవారు." (అహ్మద్, అబూదావూద్, తిర్మిజీ)

హజ్రత్ అబూజర్(రజి) వివరించారు: ఒకసారి దైవప్రవక్త సల్లం రాత్రి నమాజ్‌లో నిలబడ్డారు. ఉదయం వరకూ ఈ ఆయత్‌నే పలుమార్లు పఠించారు. ఇన్‌తుఅజ్జిబ్ హుమ్ ఫ ఇన్నహుమ్ ఇబాదుక వ ఇన్ తగ్‌ఫిర్ లహుమ్ ఫ ఇన్నక అన్‌తల్ అజీజుల్ హకీమ్. (నీవు గనక శిక్షించదలిస్తే వీరు నీ దాసులే. మరియు నీవు గనక వీరిని క్షమించివేస్తే, నీకు ప్రతిదానికీ అధికారం ఉంది. నీవు గొప్ప వివేచనాపరుడివి) (నసాయి, ఇబ్నెమాజ). హజ్రత్ అబూహురైరా(రజి) ఇలా అంటున్నారు: "ప్రవక్త(సల్లం) రాత్రవేళ ఖుర్‌ఆన్‌ను పఠించినప్పుడు ఆయన స్వరం ఒకసారి గ్గరగా, మరోసారి మందంగా ఉండేది. (అబూదావూద్)

హజ్రత్ అబ్దుల్లా బిన్ మసూద్(రజి) ఉల్లేఖనం: చాలామంది ఖుర్‌ఆన్ పఠనాన్నయితే తప్పక చేస్తారు, గాని అది వారి గొంతు నుండి క్రిందకు దిగదు. ఖుర్‌ఆన్ హృదయాంతరాళానికి చేరుకొని, అక్కడే చోటు చేసుకునివుంటే ప్రయోజనమూ కలుగుతుంది."

జలాలుద్దీన్ సుయూతీ(రహ్మాలై) రాస్తున్నారు:

ఖుర్‌ఆన్‌ను పఠించేటప్పుడు దాని అర్థాన్ని గ్రహిస్తూ దాని భావాన్ని పరిశీలిస్తూ పోవడం మస్నూన్ (ప్రవక్త సంప్రదాయం). ఖుర్‌ఆన్ పఠనంలోని ఉద్దేశం కూడా అదే. దీనివల్లనే హృదయాలలో వెలుగు మరియు తన్మయత్వం జనిస్తాయి.

తర్తీల్ అంటే అర్థం నోటంటా వెలువడిన పదాలకు మనసులో వాటి అర్థాన్ని పరిశీలించండి. ప్రతి ఆయత్ భావాన్ని గ్రహించండి. ఆదేశాలేవో, నిషేధాలేవో ఆలోచించండి. వాటిని అంగీకరించడం, గతంలో జరిగిన

తప్పుల కారణాలపై దృష్టి నిలిపి క్షమాపణ కోరడం జరగాలి. కారుణ్యాన్ని సూచించే ఆయత్ వచ్చినప్పుడు సంతోషించి అల్లాహ్ నుండి ఆ కారుణ్యాన్ని అర్థించండి. శిక్షకు సంబంధించిన ఆయత్ వచ్చినప్పుడు దానికి భయపడండి. ఆ శిక్ష నుండి అల్లాహ్ శరణువేడండి. అల్లాహ్ గుణగణాలకు సంబంధించిన ప్రస్తావన వచ్చినప్పుడు ఆయన్ని స్తుతించండి. దుఆ సందర్భం వచ్చినప్పుడు వినమ్రతతో మీ అవసరాలను అల్లాహ్‌తో అర్థించండి.

తర్తీల్ సూచనను పాటించడంలో రాత్రి నిలబడటంలో దైవ ప్రవక్త(స) వారి ఖుర్ఆన్ పఠనంలోని స్థితి కూడా ఇలాగే ఉండేది. ఆ స్థాయికి చేరడం వల్ల మనకది సాధ్యమవుతుందా అని ఆలోచించండి. ఎల్లప్పుడూ శ్రద్ధతో మనసుపెట్టి చదవగలగడానికి తర్తీల్‌కు సంబంధించిన ఈ రూపం మన కళ్ళెదుట ఉండాలి. దాని కాంక్ష మనసులో ఉండాలి. దాన్ని పొందే ప్రయత్నం చేయాలి. మన ఖిరాఅత్‌తో రాజీపడడం సంతృప్తి పడటం జరుగ కూడదు.

రాత్రి నిలబడమనే ఆదేశానికి కారణం, అందులోని మర్మం ఏమిటో వివరించడం జరుగుతుంది.

# భారం కలిగిన బాధ్యతతో కూడిన మాట (వాణి)

## రాత్రి నమాజ్‌లో ఖుర్ఆన్ పఠనం ఎందుకు?

"ఇన్నా సనుల్ఖీ అలైక ఖౌలన్ సఖీలా." (ముజ్జమిల్)

(మేము మీపై బరువుతో కూడిన మాటను మోపనున్నాము) అయితే ఈ బరువైన మాట (ఖౌలె సఖీల్) అంటే ఏమిటి? అల్లాహ్

వాణియే బరువయిన మాట. ప్రత్యక్షంగానూ, భావపరంగానూ. దైవప్రవక్త(సల్లం)పై వహీ (దైవవాణి) అవతరించేటప్పుడు ఆయన(సల్లం) కూడా ఎంతో బరువు మోస్తున్న భావనకు గురయ్యేవారు. ఇంకా ఆయన(స) పరిసర వాతావరణం కూడా.

హజ్రత్ ఆయిషా(రజి) ఉల్లేఖనం: నీరు గడ్డకట్టే చలికాలంలో దైవప్రవక్త(స)పై వహీ అవతరిస్తుండగా చూశాను. అప్పుడు ఆయన(స) నుదుట నుండి చెమట బిందువులు కారేవి." (బుకారీ, ముస్లిం)

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్(రజి) ఇలా అంటున్నారు: దైవప్రవక్త సల్లంను (ఈ విషయమై) అడగగా ఆయన(స) ఇలా తెలియచేశారు. "కొన్ని సమయాల్లో వహీ అవతరణ సమయంలో నాపై ఎంత బరువు పడుతుందంటే నా ప్రాణాలు పోతాయా అని భావించేవాణ్ణి." (అహ్మద్)

హజ్రత్ జైద్‌బిన్ సామిత్(రజి) వివరిస్తున్నారు: ఒకసారి ఆయన(స) నా తొడలపై తన తొడలను ఉంచి ఉన్న స్థితిలో వహీ అవతరించింది. నా తొడలపై అప్పుడు ఎంత బరువు అనిపించిందంటే ఇక తొడలు విరిగి పోతాయా అన్నంత బరువు అనుభవించాను.

హజ్రత్ ఆయిషా(రజి) ఉల్లేఖనం: ఆయన(స) ఒంటెపై కూర్చొని ఉన్న స్థితిలో వహీ అవతరణ జరిగినప్పుడల్లా ఒంటె తన రొమ్ముని నేలపై ఆనించివేసేది. వహీ అవతరణ ముగిసే వరకూ కదలకుండా అలాగే ఉండిపోయేది. (అహ్మద్, హాకిమ్)

"వహీ అవతరణ అయితే అంత బరువయినదే. దాని డిమాండ్లను పూర్తి చెయ్యడం, దాని ఆదేశాలను పాటించడం అంతకంటే బరువైనది. అదే అసలయిన బరువు. ఖుర్‌ఆన్‌ను భారమైన వాణి అని ఎందుకు చెప్పడం జరిగిందంటే, దాని ఆదేశాలను అమలుపర్చడం, దాని బోధనల

మూసలో పడిన ఓ నమూనాగా బయటకు రావడం, దాని సందేశాన్ని చేబూని నకల ప్రపంచాన్ని ఎదిరించడం, దాని ప్రకారం మొత్తం విశ్వాసాలు, ఆలోచనలు, నైతికత, మర్యాదలు, సంస్కృతీ నాగరికతల వ్యవస్థలో విప్లవాన్ని తీసుకురావడం ఎంతటి గొప్పకార్యం అంటే, అంతకు మించిన మరే భారీ కార్యాన్నీ ఊహించలేము. (సయ్యిద్ మౌదూదీ, తఫ్హీముల్ ఖుర్ఆన్, 6వ భాగం, 127వ పేజి)

వహీ అవతరణ యొక్క ప్రధానమైన, ప్రాథమికమైన, మరియు తప్పనిసరైన డిమాండు సందేశ ప్రచారం. ఇది బాహాటంగా, బహిరంగంగా చేయవలసిన పని. వహీని సురక్షితపర్చడం, ఇతరులకు చేరవెయ్యడంలో బాధలు మోయడం దృష్ట్యా కూడా ఇది అన్నింటికన్నా భారమైన పనే. అందులో శ్రమా ఉంది. పరీక్షా మరియు బాధ్యతలు కూడా ఉన్నాయి. ఒకరిచేత ఒప్పింపచేయటం ఆయన(స) ఆధీనంలో లేని విషయం. కాని ఇతర ప్రవక్తలు, సందేశహరుల్లా ఆయన(స) అందరికీ ఉత్తమరీతిలో దైవసందేశాన్ని అందచేసే హోదాను అలంకరించి వున్నారు. అందుకోసమే తీర్చిదిద్దబడ్డారు కూడాను. అందరి ఎడతెగని తిరస్కారం, అన్నిరకాల అభిశంసనలు, వ్యతిరేకతలు సాగుతున్నప్పటికీ దైవసందేశాన్ని సంపన్నం చేసే బాధ్యతను నెరవేర్చడం ఆయన(స) విధి. ఇంతకన్నా గొప్ప బాధ్యత మరేది కాగలదు? దైవగ్రంథంలో ఈ బాధ్యత గురించిన ప్రస్తావన కూడా మీరు విన్నట్లయితే మీ కళ్ళనుండి కన్నీళ్ళు కారతాయి. అందుకోసం ఆయన(స) ప్రాణాలకు తెగించి ప్రయత్నం చేశారు. గుండెలు బద్దలయ్యే పరిస్థితుల్లో, సహనాన్ని పరీక్షించే దౌర్జన్యాలు జరిగినా ఈ కార్యాన్ని విడిచిపెట్టలేదాయన. అందుకోసం ఆయన అన్నిరకాల బాధలకు గురిచేయ బడ్డారు. ఈ పని కారణంగా ఆయనకు ఎంతో చింత, వ్యాకులత ఉండేవి. విచారం దిగులూ ఉండేవి. అంటే రాత్రి నిలబడటాన్ని

దుర్భరమైనదిగా భావించకు, మేము ఇంతకన్నా భారమైన పనులు నీచేత చేయించ నున్నామని చెప్పడమే దీనిభావం. ఇటువంటి భారాన్ని మోసే స్తోమత కలుగచేసేందుకు రాత్రి నమాజ్ చేయమని ఆదేశించడం జరిగింది.

## రాత్రి నిలబడటం - దైవదౌత్య కార్యం

ఇన్న నాషిఅతన్‌ల్లయ్‌లి హియ అషద్దు వత్‌అవ్‌ వ్వ అఖ్‌వము ఖీలా.

"నిశ్చయంగా రాత్రి లేవడం మనసును అదుపులో పెట్టుకోవడానికి దివ్యమైనది. ఇంకా ఖుర్‌ఆన్ పఠించటానికి ఎంతో అనువైనది." (ముజ్జమిల్)

హజ్రత్ ఆయిషా(రజి) గారి ఉల్లేఖనం ప్రకారం 'నాషియతుల్ లైలి' అంటే, రాత్రి నిదురపోయిన తర్వాత నమాజ్ కోసం మేల్కొనడం. ఈ అర్థం రీత్యా నాషియతల్‌లైల్ (రాత్రి లేవడానికి) తహజ్జుద్ పదం వాడబడుతుంది. తహజ్జుద్ అర్థం కూడా రాత్రి పడుకున్న తర్వాత లేచి నమాజ్ చేయడం.

'వతాలి' అనే పదానికి నలిపివేయడం, దంచివేయడం అన్న అర్థాలున్నాయి. అంటే మనసును అణచడం అధర్మకరమైన కోరికలు తలెత్తకుండా ఆపడంలో రాత్రి నమాజ్ ఎంతో ఉపయుక్తం.

ఇదే మూలంలో మరోపదం 'వితాఅ' వుంది. దాని అర్థం అనుకూలత. హజ్రత్ ఇబ్నె అబ్బాస్(రజి) ప్రకారం, రాత్రివేళ చెవులు, మనసులకు అనుకూలత వుంటుంది. ఆ సమయంలో అరుపులు కేకలు వుండవు. శ్రద్ధను పట్టిలాగే దృశ్యాలు గానీ, శబ్దాలూ తదితర వ్యాపకాలూ వుండవు. మనిషి తన హృదయ స్పందనను సయితం వినగలుగుతాడు. అప్పుడు మీనోట వెలువడే మాటల్ని చెవులు కూడా వినగలుగుతాయి.

హృదయమూ హాజరుగానే ఉంటుంది. ఖుర్‌ఆన్ పారాయణ లక్ష్యం అంటే, దైవనామ స్మరణ మరియు హితబోధలు.

"హృదయం ఉండి, విషయాన్ని శ్రద్ధగా ఆలకించే ప్రతి వ్యక్తికీ ఈ చరిత్రలో గుణపాఠం ఉన్నది." (ఖాఫ్ 50: 37)

అందుచేతనే మరోమాట సెలవిచ్చాడు: 'వఖ్‌వముఖీలా'అని. అంటే నిఘంటువు అర్థం, రాత్రి నమాజ్ కోసం లేవటం. నోటినుండి వెలువడే వాక్కులను బాగా సూటిగా సక్రమపర్చడం. అంటే ఆ సమయంలో ఖుర్‌ఆన్‌ను అమిత ప్రశాంతతతో, సంతృప్తికరంగా శ్రద్ధతోపాటు అర్థం చేసుకొని పఠించగలుగుతారు.

ఇబ్నె అబ్బాస్(రజి) ఇలా అంటారు: ఆ సమయంలో మనిషికి, ఖుర్‌ఆన్ గురించి శ్రద్ధగా చింతన చేయడానికి దాన్ని అర్థం చేసుకోవడానికి అనువయిన సమయం. (అబూదావూద్)

అంటే రాత్రి తహజ్జుద్ నమాజ్‌లో హృదయమూ నోరూ ఒక్కటవు తాయి. నోటినుండి వెలువడే ఖుర్‌ఆన్ పదాలు హృదయంలోకి చొచ్చుకు పోతాయి. ఈ ధోరణిలో దివ్యఖుర్‌ఆన్ పఠనం స్వయంగా మనోకాంక్షలను అణచడానికి, మనసును అదుపులో ఉంచుకోవడానికి, మనస్సు ప్రక్షాళనకు ఔషధంలా పనిచేస్తుంది.

కాని మీరేగనక దీన్ని పరిశీలించి చూసినట్లయితే, రాత్రి లేవటం, నమాజ్ చేయటం అన్న పని దానికదే ఈ లక్ష్యంకోసం ఎంతవరకు పనికొస్తుందో తెలుసుకోగలరు. తియ్యని నిద్ర నుండి మేల్కొనడం, వెచ్చని మెత్తని పడకను వదిలేయడం, ఉజూచేసి తమ ప్రభువు సమక్షంలో నిలబడటం, చాలాసేపు నిలబడటం, ఒంటరిగా మేల్కొనటం, నిల బడటం అదికూడా చుట్టుప్రక్కల మానవులందరూ నిద్రిస్తూఉండగా,

సృష్టిలోని ప్రతి వస్తువు అంధకారంలో మునిగివుండి నిద్రాణస్థితిలో కనబడుతుండగా-ఇంకా ప్రతి రాత్రీ ఈ క్రియనే తిరిగిచేయడం మనసును అదుపులో వుంచుకో వడానికి ఇంతకన్నా ఉపయుక్తమైన ప్రిస్క్రిప్షన్ మరేదయినా ఉందా? ఈ ఆచరణ ప్రతిరాత్రీ మనసుని ప్రతి చిక్కు పరిస్థితులలో అన్ని ఆపేక్షలు, కోరికల్ని త్యాగంచేసి తన ప్రభువు పిలుపుకు హాజరయి ఆయన ఆదేశాన్ని పాటిస్తూ నిలబడిపోవడం. అతడి ఆదేశాల పాటింపులో నిమగ్నమయ్యే శిక్షణనిస్తుంది.

## సందేశానికీ, రాత్రి నిలబడటానికీ పోలిక

ఇంకాస్త శ్రద్ధగా గమనిస్తే రాత్రివేళ నమాజ్‌కు లేవటానికీ, ధర్మసందేశ ప్రచారం మరియు జిహాద్ కోసం లేచి నిలబడటానికీ దగ్గరి పోలిక వుండటాన్ని మీరు గమనిస్తారు. వాటి వాస్తవాల దృష్ట్యా రెండూ ఒకే విధమైన ఆచరణలు, ఆ రెండూ ఒకే రకమైన మనిషిని కోరుతున్నాయి. అంటే 'ఖుమిల్లయ్‌ల్' (రాత్రి నిలబడు) మరియు 'ఖుమ్ ఫ అన్‌జిర్' (నిలబడు, హెచ్చరించు) ఒకే ఆదేశానికి చెందిన రెండు పార్శ్వాలన్నమాట.

రాత్రి నిలబడటమన్న ఆదేశం. మిమ్మల్ని కోరేదేమిటంటే, మీరు నిద్రలాంటి మనోమస్తిష్కాలను ఆవరించుకునే మధురమైన దాన్ని, ఇంకా మెత్తని వెచ్చని పరుపులోని హాయిని వదలి నమాజ్ కోసం నిలబడమన్నదే.

సందేశం, జిహాద్‌ల కార్యం కూడా రాత్రి నమాజ్ వలెనే, మీరు మీ ప్రభువు పిలుపుకు హాజరవ్వాలని ఆ పని చేయడం కోసం నిలబడాలని కోరుతోంది. ఆ పని ఏమిటంటే, వజాహిదూ ఫిల్లాహి హఖ్ఖజిహాదిహీ వతకూనూ షుహదాఅ అలన్నాస్. (అల్లాహ్ మార్గంలో జిహాద్ చేయవలసిన హక్కు ఏవిధంగా వుందో ఆ విధంగా జిహాద్ చెయ్యండి. తద్వారా మీరు మానవుల ఎదుట సత్యసాక్ష్యం ఇవ్వడానికి). పని కోసం మీ ప్రాపంచిక

జీవితంలోని ఆపేక్షలు, వ్యాపకాలను నిద్రలాంటి ఆకర్షకాలను, పడక లాంటి ప్రియమైన దానినీ త్యాగం చేసి సందేశప్రచారం చేయాలి అన్నది.

రాత్రి నమాజ్‌లాగే సందేశ కార్యం కూడా, అజ్ఞానాంధకారం ఆవరించి ఉన్న కాళరాత్రి సమయాన, రాత్రిలాగా ఎక్కడా వెలుతురు కనిపించని పరిస్థితులలో, మీరు ఒంటరిగా పనిచేసేవారై వున్న సమయంలో నిలబడటాన్ని, సహచరులు, సహాయకులు ఎవరూ లేకపోయినా, ఎవరూ వినీ వినక పోయినా, రాత్రింబగళ్ళు ప్రతినిత్యం, అన్ని విధాలుగా పిలిచినా ఎవరూ మేల్కొనని పరిస్థితులలో మీరు పనిచేయడాన్ని కోరుతోంది. "సల్లూ వన్నాసు యనాము"- (ప్రజలు నిద్రిస్తున్న సమయంలో నమాజ్ చెయ్యండి). అంగీకారం, ఉత్తీర్ణత ఎప్పుడు లభిస్తాయో, సహాయం ఎప్పుడు లభిస్తుందో, విజయం ఎప్పుడు వరిస్తుందో లేక ఉదయం ఎప్పుడు అవుతుందో తెలియని అయోమయస్థితిలోనూ నిలబడడాన్ని కోరుతుంది.

దైవప్రవక్త(స), హిరా గుహ నుండి తిరిగి వచ్చి 'ఖుమ్ ఫ అన్‌జిర్' అన్న ఆదేశాన్ని పాటించడంలో పూర్తిగా నిమగ్నులయినప్పుడు ఆయన (సల్లం) పరిస్థితి ఇదే. ఇటువంటి పరిస్థితులలో 'ఖౌలె సఖీల్'ను మోసే స్తోమత కలిగించడానికి, ఆ బరువు మోయడానికి శక్తి, ధైర్యం, ఉత్సాహం జనింప జేయటానికి, ఆ బరువును తన ప్రభువు ఉపదేశించిన విధంగా మోయడానికి ఖుమిల్లైల్ (రాత్రి నమాజ్) ఫార్ములా ఎంతో ఉపయుక్తమూ, ప్రభావ పూరితమైన ఫార్ములా కంటే మరేదీ లేదు.

## ప్రేమ భరిత ఫార్ములా

ప్రేమ లేనిదే రాత్రి నిలబడటం సాధ్యం కాదన్నది మరో విషయం. ఇది ప్రేమకు నిదర్శనమూ ప్రేమను కలిగించే, పెంపొందించే దివ్యాస్త్రం కూడాను. ప్రేమకు నిదర్శనాలు, దాని అనుభూతుల అనుభవం లేనివారు

మీలో ఎవరయినా ఉన్నారా? లేక మనిషి ప్రేమలోబడితే రాత్రి నిదుర కరువయిపోతుందని, పడక మీద నక్షత్రాలు లెక్కపెట్టుకుంటూ రాత్రి గడిచిపోతుందని తెలియనివారెవరు? అతడు తన ప్రేయసి వీధివైపుకు సాగిపోతాడు. ఆమె ఇంటిచుట్టూ చక్కర్లు కొడతాడు. తలుపు తట్టేది కూడా ఈ సమయంలోనే. ప్రేయసికి చేరువయ్యే కోరిక, ఆమె కోసం అన్వేషణకు అసలు సమయం ఇదే. ఆమెతో రహస్య మంతనాలు, గుసగుసలు, వేడుకోళ్ళు (మునాజాత్) చేసుకునేందుకు తగిన సమయం ఇదే. ఎడబాటులో అర్ధరాత్రి శోకించడానికి ప్రాతఃకాల నిట్టూర్పులకూ సమయం ఇదే.

అల్లాహ్‌తో ప్రేమ చిగురించినప్పుడు ఆయనపట్ల భయం కూడా వెన్నంటి వస్తుంది. అనురాగం పెరిగినకొద్దీ భయం కూడా పెరుగుతుంది. ప్రేమహక్కును చెల్లించడంలో లోపం గురించిన భయం, ప్రియతముని కోపం పట్ల భయం, ప్రియతముని నిర్లక్ష్యభావం పట్ల భయం, అతడు తననుండి మొహం తిప్పుకుంటాడేమోనన్న భయం. అతడు తనతో మాట్లాడడేమో అన్న భయం, ప్రేమతో కలగలసి విశ్వాసపు మత్తును రెట్టింపు చేస్తుంది. అందుచేతనే రాత్రి నిలబడడం, ప్రేమ, ఆశ, నమ్మకం భయాలతో పోల్చబడింది. ప్రపంచంలో ప్రియతముని ప్రేమలో తన మనసు తన ప్రాణం వెచ్చించడం విచ్చిలవిడిగా ఖర్చుచేయడం. ఇదే రాత్రి నిలబడటానికి ఇచ్చే వివరణ.

(ఆ వ్యక్తి ధోరణి ఉత్తమమైనదా) లేక రాత్రి ఘడియలలో నిలబడి వుండే, సజ్దాలు చేసే, పరలోక భయం కలిగివుండే, తన ప్రభువు కారుణ్యం పట్ల నమ్మకం కలిగివుండే ఈ వ్యక్తి ధోరణి ఉత్తమమైనదా? (ఖుర్‌ఆన్)

"వారి వీపులు పడకలకు దూరంగా ఉంటాయి. వారు భయం తోనూ ఆశతోనూ తమ ప్రభువును వేడుకుంటారు. ఇంకా మేము ఇచ్చిన దానినుండి ఖర్చుచేస్తారు." (ఖుర్‌ఆన్)

ఈమాన్ వాస్తవికతను అర్థం చేసుకున్నవానికి ప్రేమ అనేది కలగకపోవడం అసాధ్యం. "విశ్వాసులు అన్నింటికంటే అల్లాహ్‌నే ప్రేమిస్తారు." (అల్ బఖర: 165) ప్రేమ లేని విశ్వాసం ఓ ఉత్తుత్తి ప్రగల్భం. ఓ బాహ్యాడంబరం, చట్టానికే సంబంధించిన సూత్రం. అల్లాహ్ అందరికన్నా మించి ప్రియతముడు అయినప్పుడు ఆ ప్రేమ తప్పనిసరిగా కోరేది ఆయన ప్రవక్త(స), ఆయన ధర్మం, ఆయన మార్గంలో జిహాద్ కూడా, ఆయన మార్గంలో జిహాద్ చేసే వారుకూడా- ఐతే విశ్వాసంలోని రుచి మరియు ఈమాన్‌లోని మాధుర్యం నరనరాల్లో జీర్ణించుకుపోయినప్పుడు అది మనసూ, ఆత్మలను మాధుర్యభరితం చేస్తుంది. అలా మాధుర్యాన్ని గ్రోలిన హృదయం ఈమాన్ యొక్క డిమాండ్లన్నింటిని నెరవేర్చమని ప్రోత్సహిస్తుంది. ఆత్మలో నుండి కోరిక జనిస్తుంది. బాహ్యాపరమైన చలనం, ఒత్తిడి కనీస స్థాయిలో ఉండిపోతుంది. ఈ ప్రేమ, రాత్రులలో ప్రియతముని సాన్నిధ్యం, సంభాషణ, వేడుకోలు కోసం పడక నుండి లేపి నిలబెడుతుంది. ప్రియతమునితో సంభాషణ, ప్రార్థనలవల్ల ఈ ప్రేమ వృద్ధిచెందుతూ పోతుంది. కారుణ్యమేఘాల నుండి కురిసిన వానజల్లు పంటపొలాలను తడిపినట్లుగా ఖుర్‌ఆన్ పఠనం మనసులను అర్థవంతం చేస్తుంది. ఈ ప్రేమే, పగటిపూట మానవాళిని అల్లాహ్‌వైపు ఆహ్వానించడానికి, ఆయన మార్గంలో జిహాద్ చేయడానికీ సంసిద్ధం చేస్తుంది.

రాత్రి నిలబడటం వలన పరాత్పరుని ప్రేమ రంగును పులుముకుని లోతునూ విశాలతనూ సంతరించుకుంటుంది. ఆయన ప్రేమ ఆధారంగానే కఠినవాక్కు యొక్క భారం మధురంగా, సంతోషదాయకంగా మారిపోతుంది. సందేశం, జిహాద్‌ల మార్గంలో ప్రతి అడుగూ, ప్రతి దెబ్బ, ప్రతి నష్టం ఒక వినూత్నమైన తాజాదనాన్ని ప్రసాదిస్తుంది. యుద్ధం ద్వారా

ఏర్పడే రణగొణ ధ్వనులు మైమరపించే పిలుపుగా, మనోహరమైనవిగా మారిపోయాయి. ప్రాణాలు అర్పించడం ఎంత మధురం అయిపోతుం దంటే మళ్ళీ మళ్ళీ జన్మించి ప్రాణాలు అర్పిస్తే ఎంత బాగుండు అనే కోరిక కలుగుతుంది. ప్రతి పరీక్ష ఒక వినూత్నను అనుగ్రహిస్తుంది. గెలుపూ ఓటములన్నీ సమానంగా కనబడతాయి.

## రాత్రివేళ చేజాపి అర్థించేవాడు

రాత్రి నమాజ్ కోసం లేవడం అన్నది అల్లాహ్ స్మరణ మరియు ఆయన వాణిని అర్థంచేసుకునే మనోకాంక్షల ప్రేమైక మార్గాల్నీ తెరుస్తుంది. రాత్రి సమయం, చేయిజాపి అర్థించేవాడికి తాను అర్థించేందుకు అది ఉత్తమమైన సమయం. ప్రత్యేకించి రాత్రి చివరిభాగంలో అల్లాహ్ తన దాసులకు అత్యంత చేరువవుతాడు. తన ప్రత్యేక కారుణ్యాలను అవతరింపజేస్తాడు. అప్పుడు తన సమక్షంలో వచ్చిన యాచకులకు తన రహస్యాలను బట్టబయలు చేస్తాడు దైవం.

దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారని హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖించారు: రాత్రి మూడవభాగం మిగిలివుండగా మన ప్రభువు ప్రపంచ ఆకాశానికి దిగి ఇలా సెలవిస్తాడు:

"నన్ను పిలిచేవారెవరైనా ఉన్నారా? వారి పిలుపు వింటాను. నన్ను అర్థించేవారెవరైనా ఉన్నారా, నేను వారికి ఇస్తాను. నన్ను మోక్షం అర్థించే వారెవరైనా ఉన్నారా? వారికి నేను అనుగ్రహిస్తాను." (బుఖారీ, ముస్లిం)

'ముస్లిం' ఉల్లేఖనంలో ఇంకా ఇలా ఉంది:

"అప్పుడు ఆయన తన చేయి జాపి ఫజ్ర్ వరకూ, "రిక్తుడు, దరిద్రుడు అయినవాడికి, దుష్టుడు కానివాడికి అప్పు ఇచ్చేవారెవరైనా ఉన్నారా?" అని అంటూ ఉంటాడు.

దైవప్రవక్త(స) ఇలా సెలవిస్తుండగా విన్నాను అని హజ్రత్ జాబిర్(ర) అంటున్నారు:

"ప్రతిరాత్రి ఒక సమయం వుంటుంది. ఆ సమయంలో ముస్లిం అయినవాడు ఇహపరాల మేలుకోరితే అల్లాహ్ అతనికి ప్రసాదిస్తాడు. ఈ క్షణం ప్రతిరాత్రీ వస్తుంది." (ముస్లిం)

దైవప్రవక్త(స) సెలవిచ్చారని హజ్రత్ అమ్రూ బిన్ అబస(రజి) తెలియజేశారు:

"రాత్రి చివరిభాగంలో ప్రభువు తన దాసుడికి బాగా దగ్గరవుతాడు. ఆ సమయంలో నీవు దైవనామ స్మరణ చేయగలిగితే చెయ్యి." (తిర్మిజీ)

## దైవప్రవక్త(స) రాత్రి నిలబడే తీరు

రాత్రి (నమాజ్‌లో) నిలబడాలన్న ఆదేశం ప్రారంభంలో, దైవప్రవక్త(స) మరియు ఆయన(స) అనుచరులకు ఫర్జ్‌గా ఉండేది. అయితే ఈ విధిని నెరవేర్చడం అందరికీ చేతనయ్యేదికాదు. ప్రత్యేకంగా రోగగ్రస్తులు, ప్రయాణంలో ఉన్నవారు, ఉపాధి సముపార్జనలో నిమగ్నులయి ఉండేవారు, దైవమార్గంలో పోరాడుతున్నవారు దీన్ని విధిగా నిర్వర్తించలేరు. అందుచేత కొంతకాలం తరువాత- బహుశా మేరాజ్ సమయంలో, కొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఒక సంవత్సరం తర్వాత- అల్లాహ్ రాత్రి నిలబడే విధికి బదులుగా నమాజ్‌ను స్థాపించమని ఆదేశించాడు. దైవప్రవక్త(స) వారికి రాత్రి నమాజ్ జీవితాంతం విధిగా వుండింది అని కొందరి అభిప్రాయం. మరికొందరి అభిప్రాయం ప్రకారం, ఈ నమాజ్ ఆయన(స)పై చివరి వయసులో విధిగా ఉండలేదు. ఆయన(స) నఫిల్ నమాజ్‌గా దానిని నిరంతరం చేసేవారు. ఫతహజ్జద్ బిహీ నాఫిల తల్లక్" (బనీ ఇస్రాయీల్)

మొత్తమ్మీద ఆయన(స) జీవించినంతకాలం ఈ ఆదేశాన్ని పాటిస్తూ తహజ్జుద్ నమాజ్ చేసేవారు. చివరి వయసులో కూడా కొన్ని సందర్భాలలో ఆయన(స) సుదీర్ఘంగా నమాజ్‌లో పాల్గొనేవారు. అందువల్ల ఆయన(స) కాళ్ళు వాచిపోయేవి. సహాబా(రజి) ఆయన్నుద్దేశించి ఇలా అన్నారని హజ్రత్ ముగీరా(రజి) వివరించారు:

"మీ గతంలోని పాపాలన్నీ క్షమించి వేయబడ్డాయిగదా. మరి మీరు ఇలా ఎందుకు చేస్తున్నారు?" అని అడగగా ఆయన(స), "నేను కృతజ్ఞతాపరుణ్ణయిన దాసుడ్నిగా తయారుకావద్దా?" అని ఎదురు ప్రశ్న వేశారు.

వివిధ ఉల్లేఖనాలను సమీకరిస్తే ఆయన(స) రాత్రి నిలబడే ఆదర్శ రూపం కళ్ళెదుట సాక్షాత్కరిస్తుంది. ఆయన(స) మేల్కొనేవారు; ఆకాశానికేసి చూసి ఆలిఇమ్రాన్ సూరానుండి (ఇన్న ఫీ ఖల్ఖిస్సమావాతి వల్ అర్జి వఖ్తిలా ఫిల్లయ్‌లి వన్నహారి ల ఆయాతిల్లి ఊలిల్ అల్‌బాబ్ నుండి (ల అల్లకుం తుఫ్లిహూన్) సూరా చివరి వరకూ పఠించేవారు." (బుఖారీ అన్ ఇబ్నె అబ్బాస్(రజి)

ఒక్కోసారి ఆయన(స) 'లాతుఖ్లిఫుల్ మీఆద్ వరకు కూడా పఠించారు. అని ఉంది. (నసాయి, హమీద్(రజి))

ఆయన(స), నిద్ర మేల్కొన్న తర్వాత ఇలా పఠించండి అని చెప్పినమాట కూడా హదీసుగ్రంథాల్లో పొందుపర్చబడింది.

"లా ఇలాహ ఇల్లల్లాహు, వహ్దహు లాషరీకలహు, లహుల్ ముల్‌కు వలహుల్ హమ్దు, వ హువ అలా కుల్లి షయ్యిన్ ఖదీర్. సుబ్‌హా నల్లాహి వల్‌హమ్దు లిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్, వలా హౌల వలా ఖువ్వత ఇల్లాబిల్లాహ్. తర్వాత అనండి: 'రబ్బిగ్ ఫిర్లీ' లేక మరేదయినా దుఆ చేస్తే అతడి దుఆ స్వీకరించబడుతుంది. తర్వాత ఉజూ

చేసి నమాజ్ చేస్తే అతడి నమాజ్ స్వీకరించబడుతుంది." (బుఖారీ, అన్ ఉబాద(రజి) బిన్ సామిత్)

ఆ తర్వాత ఆయన(స) మిస్వాక్ చేసేవారు, ఉజూ చేసేవారు. నమాజ్‌కోసం నిలబడేవారు. అప్పుడు ఈ దుఆ చేసేవారు.

"అల్లాహుమ్మ లకల్‌హమ్దు అన్‌త ఖయ్యిముస్సమావాతి వల్‌అర్జి వమన్ ఫీ హిన్న వలకల్‌హమ్దు అన్‌త నూరుస్సమావాతి వల్ అర్జి వ మన్ ఫీ హిన్న. వ లకల్ హమ్దు అన్‌త మలికుస్సమావాతి వల్ అర్జి వమన్ ఫీ హిన్న. వ లకల్ హమ్దు అన్‌తల్ హఖ్ఖు, వవఅదకల్ హఖ్ఖు వ లిఖాఉక హఖ్ఖున్, వ ఖర్‌లుకల్ హఖ్ఖు, వల్ జన్నతుల్ హఖ్ఖున్, వన్నారు హఖ్ఖుల్, వన్నబియ్యూన హఖ్ఖున్, వ ముహమ్మదున హఖ్ఖున్, వస్సాఅతు హఖ్ఖున్, అల్లాహుమ్మలక అస్‌లమ్‌తు వ బిక ఆమన్‌తు, వ అలైక తవక్కల్‌తు వ ఇలైక లినబ్‌తు వబిక ఖాసమ్‌తు వఇలైక హాకమ్‌తు వగ్ఫిర్లీ మా ఖద్దమ్‌తు వమా అఖ్ఖరతు, వమా అస్‌రర్‌తు వమా ఆలన్‌తు వమా అన్త అ-లము బిహీ మిన్నీ, అన్‌తల్ ముఖద్దిము వ అన్‌తల్ ముఅఖ్ఖిరు అన్‌త ఇలాహీ లాఇలాహ ఇల్లా అన్‌త లాహౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహిల్ అలియ్యుల్ అజీమ్." (బుఖారీ, ఇబ్నె అబ్బాస్(ర)

("నా ప్రభూ! స్తోత్రాలు, కృతజ్ఞతలన్నీ నీ కొరకే ఆకాశాలనూ, భూమినీ ఇంకా వాటిల్లో ఉన్న దాన్నంతటినీ నిలిపిఉంచే వాడవు నీవు. ప్రశంసలు, కృతజ్ఞతలన్నీ నీ కొరకే. భూమి ఆకాశాలకూ, వాటి మధ్య వున్న సమస్తానికీ వెలుగు నీవే. ప్రశంసలూ, కృతజ్ఞతలూ నీ కొరకే. భూమి ఆకాశాలకూ వాటి మధ్యనున్న సమస్తానికీ సార్వభౌముడవు నీవే.

స్తోత్రాలు, కృతజ్ఞతలూ నీ కొరకే. నీవే సత్యం. నీ వాగ్దానం సత్యం. నిన్ను కలుసుకోవడం తథ్యం. నీ ప్రతిమాటా సత్యం. స్వర్గం సత్యం, అగ్నీ సత్యం, ప్రవక్తలందరూ సత్యవంతులే. ముహమ్మద్(స) సత్యవంతులు. తుదిదినం తథ్యం.

నా ప్రభూ! నీకు విధేయుడనయ్యాను. నిన్ను విశ్వసిస్తున్నాను. నా ప్రతి వ్యవహారాన్ని నీకే అప్పగిస్తున్నాను. నీ వైపునకే మరలుతున్నాను. నీ సహాయంతోనే పోరాడుతున్నాను. నీ నుండే తీర్పును కోరుతున్నాను.

కనుక నేను చేసిన పాపాల్ని, చేయబోయే పాపాల్ని, నేను గుప్తంగా చేసిన పాపాల్ని, బహిరంగంగా చేసిన పాపాల్ని క్షమించు. నా గురించి ఎక్కువగా తెలిసినవాడవు నీవే. ముందుకు నడిపేవాడవూ నీవే. వెనక్కి లాగే వాడివీ నీవే)"

"ఆయన(స) ఒక్కోసారి ఏడు రకాతుల నమాజు చేసేవారు. ఒక్కోసారి తొమ్మిది రకాతులు, ఒక్కోసారి పదకొండు రకాతులూ చేసేవారు. మొదటి రెండు రకాతులు తేలికపాటివి" (బుఖారీ ముస్లిం అన్ ఆయిషా (రజి).

"ఆయన(స) లేచిన తర్వాత మొదట రెండు రకాతులు తేలిక పాటివి చేయమని సూచించారు." (ముస్లిం అన్ అబూ హురైరా(రజి), "ఆయన(స) ఎప్పుడైనా తొమ్మిది రకాతులు ఎలా చేస్తారంటే కేవలం ఎనిమిదవ రకాత్‌లో తషహ్హుద్ కోసం కూర్చునేవారు." (ముస్లిం అన్ ఆయిషా(రజి)

"ఒక్కోసారి ఆయన(స) రెండేసి రకాతుల చొప్పున చేసేవారు. ఒక్కోసారి రెండు రకాతులు చేసిన తర్వాత నిద్రించేవారు. చివరకు గురకలు కూడా పెట్టేవారు. నమాజ్ చేసేటంతసేపే నిద్రించేవారు. తిరిగి లేచి రెండు రకాతులు చేసి మరల నిద్రించేవారు. తిరిగి మళ్ళీ లేచి రెండు రకాతుల చేసిన తర్వాత మూడు రకాతులు వితర్ చదివేవారు." (ముస్లిం అన్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) నసాయి బిన్ హమీద్(రజి) మరియు ఉమ్మె సల్మా(రజి).

"ఆయన(స) ఒక్కోసారి తేలికపాటి రకాత్‌లు చేసేవారు. ఒక్కోసారి సుదీర్ఘంగా ఖిరాఅత్ చేసేవారు. ఒకసారి ఆయన(స) నాలుగు రకాతులలో బఖరా, ఆలిఇమ్రాన్, నిసా, మాయిదా లేక అన్‌ఆమ్ సూరాలు చదివేవారు." (అబూ దావూద్, బిన్ హుజైఫ్(రజి)

ఒక్కోసారి ఆయన రుకూ కూడా ఖియాంకు సమానంగా వుండేది. ఖియాం కూడా రెండు రకాత్‌ల మధ్య జల్సా కూడా.

హజ్రత్ ఆయిషా(రజి) తెలియజేస్తున్నారు: "ఆయన(స) వయస్సు మీరినందువల్ల బరువు పెరిగిపోతే ఆయన(స) ఏడు రకాతులు చేసేవారు. ఎప్పుడైనా నిద్రవచ్చి లేదా వళ్ళునొప్పుల కారణంగా రాత్రి నమాజ్ చేయలేకపోయేవారు. అటువంటప్పుడు పగలు పన్నెండు రకాత్‌లు చేసేవారు. ఆయన(స) ఒక్క రాత్రిలో పూర్తి ఖుర్‌ఆన్ చదివినట్లుగానీ లేక- ఇషా- నుండి ఉదయం వరకూ నమాజ్ చేయడంగాని నాకు గుర్తులేదు. (ముస్లిం)

భవిష్యత్తులో ఆయన(స) మరియు సహాబా(రజి) ధర్మసంస్థాపనా మార్గంలో తారసపడనున్న గొప్ప జిహాద్‌కు సన్నద్ధం చేయడానికి గాను ఆయన(స)కు రాత్రి నమాజ్ చేయమన్న ఆదేశం ఇవ్వబడింది. ధర్మసంస్థాపన యొక్క ఈ ప్రత్యేకతే విలక్షణమైన ఇతర ఉద్యమాల నుండి ప్రస్ఫుటం చేస్తోంది. ఇందుకోసం ఇతర ఒనరులు, మార్గాలు ఒనగూడక పూర్వం ప్రభువును గురించి నిజమైన ఎరుక, పటిష్టమైన విశ్వాసం తడబాటులేని సహనం, తన ప్రభువుపై పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం అవసరం. ఈ గుణాలు పొందే ఏకైక మార్గం నమాజ్, ప్రత్యేకించి రాత్రి నమాజ్. అయితే దాన్ని చేయడానికి ఆదేశించబడిన విధంగా చేస్తేనే. ధర్మ సంస్థాపనా కృషి నుండి దాని సంబంధం తెగిపో కూడదు. ఈ కృషికి పునాది అదే. దాని పరిపుష్టి, విజయం కోసమే రాత్రి నమాజ్ చేయమని బోధించ

బడింది. అందుచేతనే దైవప్రవక్త(స) రాత్రి నమాజ్ (తహజ్జుద్) వాజిబ్ కాకపోయినప్పటికీ దానిని ప్రోత్సహించారు. అందుకు అనుచరులకూ, కుటుంబ సభ్యులకూ తాకీదు చేశారు.

దైవప్రవక్త(స) ఇలా సెలవిస్తుండగా విన్నానని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేస్తున్నారు:

"ఫర్జ్ నమాజ్ తర్వాత అన్నింటికంటే ఉత్తమమైనది రాత్రి (తహజ్జుద్) నమాజ్." (అహ్మద్)

దైవప్రవక్త(స) సెలవిచ్చారని హజ్రత్ అబూ ఉమామ(రజి) అంటున్నారు:

"రాత్రి నమాజ్‌ను నీపై విధించుకో. ఇది నీకు పూర్వం గతించిన సజ్జనుల విధానం. ఇది నిన్ను నీ ప్రభువు చెంతకు చేరుస్తుంది. ఇది పాపాలకు పరిహారం. పాపం నుండి ఆపుతుంది. (తిర్మిజీ)

దైవప్రవక్త(స) సెలవిచ్చారని హజ్రత్ అబూహురైరా(రజి) తెలియజేస్తున్నారు: "రాత్రి లేచి, నమాజ్‌చేసి తన భార్యను మేల్కొలిపి, ఆమె కూడా నమాజ్‌లో పాల్గొంటే ఒకవేళ భార్య మేల్కొనకపోతే ఆమె ముఖంపై నీళ్ళు చిలకరించిన వ్యక్తిపై అల్లాహ్ కారుణ్యం కురిపించుగాక!"

"రాత్రి లేచి, నమాజ్‌చేసి, తన భర్తను మేల్కొలిపి అతడూ నమాజ్‌లో పాల్గొంటే, అతడు గనక మేల్కొనని పక్షంలో అతడి ముఖంపై నీళ్ళు చిలకరించిన స్త్రీపై అల్లాహ్ కారుణ్యం కురిపించుగాక!" (అబూదావూద్, నసాయి)

హజ్రత్ ఉమ్మె సల్మా(రజి) తెలియచేస్తున్నారు: "ఒకరాత్రి దైవప్రవక్త (స) గాభరాగా నిద్రలేచి ఇలా సెలవిచ్చారు: "సుబ్‌హానల్లాహ్! రాత్రి ఎన్ని ఖజానాలు, ఎన్ని బహుమానాలు అవతరించాయో! గదులలోని వారిని

మేల్కొలిపే వారెవరైనా ఉన్నారా? ఆయన(స) తన భార్యలను ఉద్దేశించి పలికారు. వారు నమాజ్‌లో పాల్గొనాలని."

ప్రపంచంలో వస్త్రాలు ధరించేవారు చాలామంది స్త్రీలు ఉంటారు. కాని పరలోకంలో నగ్నంగా వుంటారు. (బుఖారీ)

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్(రజి) అంటున్నారు: తన తండ్రి హజ్రత్ ఉమర్ బిన్ అల్ ఖత్తాబ్(రజి) రాత్రి అల్లాహ్ ఇచ్చిన సద్బుద్ధి మేరకే నమాజ్ చేసేవారు.

రాత్రి చివరిభాగంలో ఆయన(స) తన యింటివారిని నమాజ్ కోసం మేల్కొలిపేవారు, ఇలా అనేవారు: లేవండి, నమాజ్ చేయండి అని ఈ ఆయత్ పఠించేవారు. వ'ముర్ అహ్‌లక బిస్సలాతి వస్‌తబ్‌రి అలైహా" అంటే, తమ కుటుంబసభ్యులకు నమాజ్ చెయ్యమని ఆజ్ఞాపించండి. మీరు కూడా దానికి కట్టుబడి ఉండండి అని అర్థం.

## ఆచరణా సూత్రం

రాత్రి నమాజ్ చేయడం ఎన్నడూ అంత సులభమైందిగా ఉండ లేదు. రోజుల్లో అయితే మరీకష్టం అయిపోయింది. కారణం మనం ఎరిగినదే. ప్రస్తుత జీవితంలో పనులభారం పెరిగిపోయింది. ఉపాధి గురించిన ఆలోచనే ఊపిరిసలపనీయదు. అవసరాలు, కోరికలు పెరిగిపోతే ప్రతి అవసరం, ప్రతి కోరికా, శ్రద్ధను, సమయాన్ని, శ్రమనూ కోరతాయి. కాని మీ హృదయంలో మీ ప్రభువు ఎదుట నిలబడాలన్న కోరిక మీకు ఉన్నట్లయితే, ఈ పని చెయ్యడానికి సులభ పద్ధతులూ ఉన్నాయి. ఇటువంటి సులభ పద్ధతులను అవలంభిస్తే, మీరు ప్రత్యేకమైన ఉన్నత స్థానాలను అలంకరించగల మార్గం కూడా తెరుచుకోగలదు.

రాత్రి చివరి భాగంలో లేచి, నమాజ్ చెయ్యడం కష్టం అయి

నట్లయితే నిద్రించే ముందే 8 రకాతులు చేసుకోండి. నిద్రకు ముందు నమాజ్ కోసం ఉజూ చేయడం, నిలబడటం కూడా కష్టం అనిపిస్తే ఇషా నమాజ్‌తోపాటు చేసుకోవచ్చు. దైవప్రవక్త(స) రాత్రి ప్రథమ భాగంలోనేకాక ప్రతి భాగంలోనూ నమాజ్ చేసిన దాఖలాలు మీకు కానవస్తాయి. మీరుగనక ఉద్దేశ పూర్వకంగా ఒక్కసారి రాత్రి ప్రారంభంలో చేయసాగితే ఇన్షాఅల్లాహ్ మధ్య రాత్రిలోనూ, రాత్రి ఆఖరులోనూ నమాజ్ చేసే అదృష్టం దక్కగలదు.

రాత్రి నమాజ్‌లోనూ తప్పనిసరిగా సుదీర్ఘ ఖిరాఅత్ చేయవలసిన అవసరం లేదు. ఆఖరి పది సూరాలనే రాత్రి నమాజ్‌లో పఠించండి లేదా చివరిలోని చిన్న సూరాల్ని చదివినా సరిపోతుంది. దైవప్రవక్త(స) సెలవిచ్చి నట్లు, ఇఖ్లాస్ సూరా మూడవవంతు ఖుర్ఆన్‌కు సమానం. కాఫిరూన్ సూరా నాలుగవ వంతు ఖుర్ఆన్‌కు సమానం. నస్ర్ సూరా నాలుగవ వంతు ఖుర్ఆన్‌కు సమానం. జిల్‌జాల్ సూరా సగం ఖుర్ఆన్‌కు, తకాసుర్ సూరా వెయ్యి ఆయతులకు సమానం. చిన్న సూరాలు తమ పరిమాణం రీత్యా చిన్నవే కావచ్చు. తమ అంశాలు, ప్రతిఫలం రీత్యా పెద్ద సూరాలకంటే తక్కువేమీ కాదు. దైవప్రవక్త(స) ఈవిధంగా చెప్పారని కూడా ఉల్లేఖించ బడింది. "ఖియాంలో (నిలబడి) పది ఆయత్‌లు పఠించినవాడి పేరు ఏమరుపాటు వహించినవారి జాబితాలో లిఖించబడదు. వంద ఆయతులు పఠించినవాడు సంతృప్తి చెందేవారిలోని వాడిగా పరిగణించబడతాడు." హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇలా అంటారు: "నేను ఇజాజుల్ జిలత్ మరియు అల్ ఖారియా ఆగి ఆగి పఠించినట్లయితే అది బఖరా, ఆలి ఇమ్రాన్ సూరాలను గబగబా అర్థం చేసుకోకుండా చదివిన దానికన్నా ఉత్తమం అని భావిస్తున్నాను."

## గొప్ప ప్రతిఫలం

రాత్రి చేసే నమాజ్‌కు లభించే ప్రతిఫలం ఎంత గొప్పదో ఖుర్‌ఆనే ధృవీకరిస్తుంది. దాన్ని గుర్తుంచుకోండి. వీపులు పడకలకు దూరంగా ఉంచుకున్నవారి గురించి చెప్పబడింది. ఆ ఆయతులో

"వారి కర్మలకు ప్రతిఫలంగా, కళ్ళకు చలువ కలిగించే ఎటువంటి సామగ్రి వారికొరకు దాచిపెట్టబడిందో ఆ సామగ్రి గురించి ఏ ప్రాణికీ తెలియదు." (అస్ సజ్‌దహ్: 17: 32)

రాత్రి సమయంలో తక్కువగా నిద్రించేవారు, ప్రాతఃకాలం (సహర్ వేళ) ఇస్తగ్‌ఫార్ చేసేవారి గురించి ఇలా చెప్పబడింది:

"భయభక్తులు గలవారు ఆ రోజున ఉద్యానవనాలలో నీటిబుగ్గల మధ్య ఉంటారు. వారు తమ ప్రభువు తమకు ఇచ్చిన దానిని అమిత సంతోషంతో తీసుకుంటారు. ఆ దినం రాకపూర్వం వారు సత్కార్యాలు చేసేవారుగా ఉండేవారు." (అజ్ జారియాత్: 51: 15, 16)

సజ్దా, నమాజ్, ఖుర్‌ఆన్ పఠనంలో రాత్రులను గడిపేవారిని ఇబాదుర్రహ్మాన్ (కరుణామయుని దాసులు)గా (అల్ ఫుర్‌ఖాన్: 63). నిర్ణయించడం జరిగింది. వారిని విజ్ఞానులుగా, బుద్ధిమంతులుగా చెప్పడం జరిగింది. (అజ్ జుమర్: 9)

## అల్లాహ్ వైపునకు ఆహ్వానం

ఆ తర్వాత ఇలా సెలవియ్యడం జరిగింది

'ఇన్నలక ఫిన్నహారి సబ్‌హన్ తవీలా'

(నిశ్చయంగా నీకు పగటివేళ ఎన్నో పనులు ఉంటాయి). ఎన్నో పనులు అంటే ఏమిటి? సబహ్ అంటే కొనసాగే, పరిభ్రమించే అని అర్థం.

నీళ్ళలో ఈదడానికి కూడా ఈ పదం వాడబడుతుంది. సూర్యచంద్రులు, నక్షత్రాలు అంతరిక్షంలో తమతమ కక్ష్యలలో నిరంతరం పరిభ్రమణంలో నిమగ్నమై ఉండడాన్ని గురించి వివరించడానికి దివ్యఖుర్‌ఆన్‌లో ఈ పదం వాడబడింది. 'వ కుల్లున్ ఫీ ఫలకిన్ య్యస్‌బహూన్' ఇక్కడి నుండే తస్బీహ్ అన్న పదం దైవస్మరణలో నిమగ్నమవ్వడం అన్న అర్థంలోనూ వాడబడింది. జీవితంలోని సాధారణ పనులన్నీ ఇందులో చేరివున్నాయి. పగలు చేయబడిందే ఇందుకు "వజఅల్‌నన్నాహారా మఆషా" ఈ పనులన్నీ పగటిపూట గుక్క తిరగనియ్యవు. అందుచేతనే సాధారణంగా ఈ ఆయత్ అర్థం ఇదే. పగలంతగా ఎన్నో పనులు ఉంటాయి. ఉపాధి సంపాదన కోసం తిరగటం, పనిచేయడం అవసరం అవుతుంది. విశ్రాంతిగా, శ్రద్ధతో తమ ప్రభువు ఆరాధన కోసం అతికష్టమ్మీద సమయం లభిస్తుంది. కనుక రాత్రి కొన్ని ఘడియల్ని ఆరాధన కోసం కేటాయించారు.

కాని ఒక సంఘటన గురించిన వివరణ, ఆ సంఘటన జరిగిన తీరుతెన్నులకు సంబంధించి ఉండవచ్చు. దాని వలన బయల్పడే ఫలితంగా లేదా ఉపదేశంగా కూడా జరగవచ్చు. పగలు తీరిక దొరకదు కాబట్టి రాత్రివేళ నమాజ్ చెయ్యమని చెప్పడం దాని ఉద్దేశం కాదు. రాత్రివేళ లేవడానికి గల ప్రత్యేకత కారణంగానే రాత్రి నమాజ్, రాత్రి నమాజ్ లక్ష్యాల కోసం ఇదే సరయిన సమయం. సంభాషణా తీరును బట్టి ఈ వివరణ హితోపదేశం కోసం చేయబడిందని అర్థమవుతుంది.

ఈ కోణం దృష్ట్యా 'సబహ' అనే పదం, నామస్మరణ, దైవం వైపునకు ఆహ్వానం అన్న అర్థంలో ప్రయోగించబడింది. అన్నిచోట్లా ఈ పదం స్మరణ మరియు అల్లాహ్ వైపునకు ఆహ్వానం అన్న అర్థంలోనే ఉపయోగించబడింది. తాహా సూరాలో వివరించినట్లుగా హజ్రత్ మూసా(అ) ఫిర్ఔన్ దర్బారుకు సత్యసందేశం ఇవ్వడానికి బయలుదేరుతూ, విషయ

అవగాహన, తన మాటల్లో స్పష్టత ఇంకా హజ్రత్ హారూన్(అ) అండ కోసం దుఆ చేశారు. దాని ఉద్దేశం, "దైవాన్ని అమితంగా స్మరించేందుకు, ఆయన పరిశుద్ధతను అత్యధికంగా ప్రకటించేందుకు" అన్నది. (20: 33- 34)

రాత్రి నమాజ్‌కూ, దైవసందేశ ప్రచార కార్యానికీ నడుమ గల ప్రగాఢమైన, అర్థవంతమైన సంబంధాన్ని మీరు గమనించారు. అంటే రాత్రి నమాజ్ మరియు గ్రంథపఠనం ద్వారా ఆధ్యాత్మిక సంపదను పొందండి, దానిద్వారా పగలంతా ఖుర్‌ఆన్ సందేశం అనే సంపదనూ, అనుగ్రహాన్నీ పంచడంలో నిమగ్నులవ్వండి అని. రాత్రి నమాజ్, ఖుర్‌ఆన్ పఠనం ద్వారా ఆశించబడేది కూడా ఇదే.

అక్కడ అలమ్‌నష్రహ్ సూరాలో ఏ విషయమయితే చెప్పడం జరిగిందో అది, "ఓ ప్రవక్తా! నీ నడ్డివిరిచే భారాన్ని దించేశాం. ఇంతకు ముందు నీకు ప్రవక్త పదవి లభించకపూర్వం హితబోధ అన్వేషణభారం, ప్రవక్త పదవి లభించిన తరువాత సందేశ ప్రచార భారం, పెరిగిపోయిన ఇబ్బందులు, కష్టాలనుండి గట్టెక్కి దైవదౌత్య కార్యాన్ని నిర్వర్తించినందుకు కృతజ్ఞతగా దైవనామ స్మరణ కోసం, ఆయన ధ్యానంలో లీనమైపోవడానికి నడుం బిగించు అన్నది.

ఇక్కడ ఆ క్రమాన్ని మార్చడం కారణంగా తెలిసే విషయం ఏమంటే, రెండూ ఒకదానికి మరొకటి అవినాభావ సంబంధం కలిగి ఉన్నాయన్నది. రెండూ ఒకదాన్నొకటి బలపరుస్తున్నాయి. రాత్రి నమాజ్ మరియు తన ప్రభువు ధ్యానం వైపు మరలడం వలన లభించే శక్తివలన పగటి పనిభారం తేలిక అయిపోయి పనిలో సౌలభ్యం ఏర్పడుతుంది. ఇంకా పగటి పని వలన జనించే తపన రాత్రి నడుం బిగించి నిలబడే శక్తి నిస్తుంది. ఈ పని రాత్రి నమాజ్‌కు నూతనోత్తేజాన్ని విశాలతను ఇస్తుంది.

ఇది ఉత్త సన్యాసత్వం కాకపోగా పైపెచ్చు అది జిహాద్‌గా మారిపోతుంది. అది జిహాద్‌కు తొలి మెట్టే దానికి సహకారాన్ని అందిస్తుంది. "రాత్రిపూట ఓ సన్యాసిగా, పగలు యుద్ధం చేసే గుర్రపు రౌతుగా తయారైనవారే ప్రపంచ విజేతలు కాగలరు. ఇక్కడి నుండే మరో ప్రపంచ ఆవిర్భావం జరిగేది.

## దైవస్మరణ మరియు చిత్తశుద్ధి

ఆ తరువాత ఇలా సెలవిచ్చారు:

"ఇంకా నీ ప్రభువు నామాన్ని స్మరించు. (మరియు గుర్తుంచుకో) అందరి నుండీ వేరయిపోయి ఆయనవాడవే అయిపో."

ఖుర్‌ఆన్ పఠనం కోసం రాత్రి నమాజ్, మరియు ఖుర్‌ఆన్ ప్రచారం కోసం ప్రజలను సన్మార్గంవైపుకు ఆహ్వానం అనే ఈ రెండు పనుల్నీ సక్రమంగా నెరవేర్చడానికి, వాటి ద్వారా నిజమయిన ప్రయోజనం పొందడానికి, జీవితం మొత్తాన్నే ప్రక్షాళన చేసి దాన్ని సరయిన మార్గంలో నిలపడానికి రెండు ప్రాథమిక ఆదేశాలు ఇవ్వబడుతున్నాయి.

ఒకటి జిక్ర్(స్మరణ) అంటే అనునిత్యం, అన్నిరకాలుగా అల్లాహ్‌ను స్మరించు. గుర్తుంచుకో.

రెండవది చిత్తశుద్ధి. అంటే ఏమిచేసినా కేవలం అల్లాహ్ కోసమే చెయ్యి. ఇంకెవ్వరి కోసమూ చెయ్యకు. యావజ్జీవితం ఆయన దాస్యంలోనే గడుపు. అందులో మరెవ్వరికీ భాగస్వామ్యం కల్పించకు.

ఈ రెండింటికీ పరస్పరం ప్రగాఢ సంబంధం ఉంది. అల్లాహ్ స్మరణ వలన చిత్తశుద్ధి జనిస్తుంది. పటిష్టవంతమవుతుంది. స్థిరంగా ఉంటుంది ప్రతిపనిలో కేవలం అల్లాహ్ ప్రీతిపై దృష్టి నిలపడం, కేవలం ఆయన కోసమే చెయ్యడం. సర్వకాల, సర్వావస్థల్లో అల్లాహ్ నామస్మరణ అన్నింటికన్నా ఉత్తమ విధానం.

అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించు. ఉదయం, సాయంత్రం స్మరించు. లేస్తూ, కూర్చుంటూ, పడుకుంటూ స్మరించు. ఏకాంతంలోనూ, ప్రజల మధ్యనూ స్మరించు. లోలోన మనసులోనూ, నోటితోనూ స్మరించు. మెల్లగానూ, గట్టిగానూ స్మరించు. పనీపాటలు నిర్వహిస్తూ స్మరించు. యుద్ధ మైదానంలో స్మరించు. ఈ విషయం ఖుర్‌ఆన్‌లో అనేకచోట్ల వివరంగా ఉపదేశించబడింది. అయితే ఇక్కడ అంత వివరంగా పేర్కొనబడలేదు. కేవలం స్మరించమన్న ఆదేశమే వుంది. అంటే ఇక్కడ కోరబడేది అత్యధిక స్మరణ, స్మరణలో శాశ్వతలే. అస్పష్టత, గుంభనాలు మస్తిష్కంలో జిజ్ఞాసను పుట్టిస్తాయి. ఆ జిజ్ఞాస ద్వారా లభించిన జ్ఞానమే విశ్వసనీయమైనది.

మనిషి తన జీవితంలో ఆచరించే ప్రతి కర్మకు ప్రేరేపించే మూలాలు జ్ఞాపకశక్తి, ఆలోచన మరియు మనోభావాలు. కాబట్టి ఇవి అల్లాహ్ స్మరణలో ఎంత లీనమైతే దానిలోనే మునిగి, దానివైపే కేంద్రీకరించబడి, అల్లాహ్ స్మరణతో అనుసంధింపబడి ఉంటాయో, మనసు కూడా అంతేస్థాయిలో సజీవంగా, సక్రమంగా వుంటుంది. మనసు ఎంత సజీవంగా ఉంటుందో జీవితం కూడా అంతే పవిత్రంగా పరిశుద్ధంగా, సక్రమంగా వుండగలదు.

స్మరణ అనేది జీవన సామగ్రి మాత్రమేకాదు, అన్నిరకాల షైతాను ప్రేరేపించే దుష్టసంకల్పాలు కలగకుండా రక్షించే అన్నిటికన్నా సురక్షిత ఆశ్రయం జిక్ర్. ఇదే మనోప్రక్షాళనకు సూత్రం. ఈ లక్ష్యం కోసమే ఆరాధనలన్నీ విధి (ఫర్జ్)గా చేయబడ్డాయి. ఖుర్‌ఆన్ కూడా ఓ స్మరణే. ఇది మనోమధనం, స్మరణల కోసమే అవతరించబడింది. దివ్యఖుర్‌ఆన్ స్మరణకు ఇంత ప్రాముఖ్యానిచ్చి అంత గట్టిగా తాకీదు చేయడానికిగల కారణం కూడా ఇదే. స్మరణ, మనో ప్రక్షాళనకు సూత్రం. ప్రతి దోషం దుష్ట

ప్రేరణ వచ్చేది మనోభావాలు, మనోకాంక్షల వల్లనే. ఈ దుష్టఊహలు షైతాన్ కల్పించినా లేక మానవులు స్వయంగా ప్రేరేపించినాసరే. మనసు దైవనామ స్మరణలో గనక నిమగ్నమయి ఉండినట్లయితే ఆ వెలుగురాగానే చీకట్లు తొలగిపోయినట్లుగా దుష్టఊహలు వాటికవే దూరంగా తొలిగి పోతాయి.

జిక్ర్ (స్మరణ) అంటే సంపూర్ణ అర్థం, మీరు త్రికరణశుద్ధితో దైవ సంతుష్టి కోసం చేసేపని, మీరు ప్రతిక్షణం స్మరించగలిగేది ఈ అర్థంలోనే. హజ్రత్ ఆయిషా(ర) ఇలా సెలవిస్తున్నారు: "దైవప్రవక్త(స) నిత్యం అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండేవారు." ఈ స్మరించడం పైన తెలిపిన అర్థంలోనే.

'నీ ప్రభువు నామస్మరణ చెయ్యి' అని సెలవిచ్చాడు దైవం. మొదటి వహీ కూడా ఇలానే "నీ ప్రభువు పేరుతో పఠించు మరియు వినిపించు." అన్నదే. ఇక్కడ అల్లాహ్, అల్లాహ్ అంటూ ఆయన నామజపం చేయడంలోని ధర్మబద్ధత రుజువు అవుతుందా? అలా చేయడం సబబు అన్న సూచన లభిస్తుందా? అన్న చర్చ అప్రస్తుతం. అల్లాహ్ వ్యక్తిత్వం విషయంలో మానవమాత్రుల పరిమిత మేథస్సుతో ఊహించడం సాధ్యమూ, ధర్మసమ్మతమూ కాదు. ఆయన గుణగణాల సంపూర్ణ అనుభూతి మన శక్తికి మించిన పని. మన పరిమిత జ్ఞానం, అనుభవాలపై ఆధారపడిన మన భాషలో మనతో సంభాషించాడు, తన గుణాలను మనకు ఎరుకపర్చాడు. ఆయన పేరు మన నోటికి వచ్చినప్పటికీ ఆ పదాలద్వారా ఆయన మనకు నేర్పిన ఆయన గుణాలే మన బుర్రలో మెదలుతాయి. 'నామవాచకం' అన్నది అరబీభాషలో విశేషంగా, ఎరుక కోసం ఉపయోగించబడే పదం. పైగా ప్రతిభాషలోనూ ఏ వస్తువు పేరు పలికినా దాని గుణాలే స్ఫురణకు వస్తాయి. అల్లాహ్ తన గుణాలను వివరిస్తూనే సెలవిస్తున్నాడు. "వలహుల్ అస్మాఉల్ హుస్నా' (సుందర నామాలన్నీ ఆయనవే). (అల్ హషర్: 24)

ఆయన పేరులో ఆయన గుణవాచకాలు ఉన్నట్లు చెప్పడం జరిగింది. "అనండి! అల్లాహ్ అని పిలిచినా, రహ్మాన్ అని పిలిచినా, ఎలా పిలిచినా సుందర నామాలు ఆయనవే". (అస్రా: 17: 110)

కనుక ప్రభువు పేరు స్మరించినా, గుర్తుంచుకున్నా దాని అర్థం ఆయన గుణాలను గుర్తుంచుకోవడమే. సుందర నామాలంటే ఇవే. ఈ గుణాల గురించిన సరయిన జ్ఞానం ఉండాలి. వాటి ఎరుక వుండాలి. వాటిపై నమ్మకం ఉండాలి. ఇవి మనోమస్తిష్కాలలో మెదులుతూ వుండాలి. నోటితో వాటి ఉచ్ఛారణ జరగాలి. అప్పుడే మనిషి వెనుక ఒక గొప్ప సైన్యం అతడి భద్రతాదళంగా సిద్ధంగా వుంటుంది. షైతాన్ సైన్యాలు ఈ సైన్యం ముందు రవ్వంతయినా గౌరవం లేనివి. జిక్ర్ చేసే వ్యక్తి తనను తాను పర్వతాల కన్నా పటిష్టవంతునిగా భావిస్తాడు.

## ఆయన జ్ఞానం, ఆయన ఎరుక, ఆయనపై నమ్మకాలు ఎలాంటివి?

సృష్టిలోని ప్రతి వస్తువును కేవలం అల్లాహ్యే సృజించాడు. ప్రతిదానికీ ఆయనే జీవం పోశాడు. ప్రతి వస్తువూ ఆయన నిలిపి వుంచినందువల్లనే నిలబడి వుంది. అన్నిరకాల అధికారం ఆయనకే వుంది. ఆయన తప్ప ఎవ్వరికీ ఏవిధమైన అధికారమూ లేదు. జరిగేదంతా మరియు జరగనిదీ అంతా కూడా ఆయన ఇష్టం, ఉద్దేశం, ఆదేశాలపై ఆధారపడే ఉంది. చెట్టు నుండి ఏ ఆకు రాలినా ఆయన ఆదేశం ప్రకారమే రాలుతుంది. అది ఆయనకు తెలుసు. ఉపాధి ఏది దొరికినా ఇచ్చేది ఆయనే. ఆయన ఎల్లవేళలా మన వెంటే వుంటాడు. మనం ఆయన కళ్ళముందే ఉంటాము.

మరణానంతరం ఆయన్ను కలుసుకోవలసి వుంది. అందుకు ఏర్పాట్లు చేసుకోవడానికి లభించిన గడువు ఈ రోజే.

ఇక్కడా, అక్కడా మనతోగల ఆయన సంబంధం, మన గురించి ఆయన నిర్ణయాలన్నీ దైవత్వ నిర్ణయాలు. అవి ఆ అనంత కరుణా మయుడు, అపార కృపాశీలుని నిర్ణయాలు- ఇవన్నీ నేరుగా ఆయన కారుణ్యంపై ఆధారపడి వున్నాయి. మనకు ఖుర్‌ఆన్‌లో అంతటా కనిపిస్తాయి ఈ గుణాలు.

ఆ గుణాలకు సంబంధించి జ్ఞానం, వాటిపై నమ్మకం వలన కలిగే సహజ ఫలితంగా మీరు సకల ప్రాణికోటి నుండి 'వేరుపడి' - అవి నశింపు పొందేవి, అంతమైపోయేవి, ఎటువంటి వాస్తవమూ లేనివి- కేవలం, ఉనికిలోవుండే ఆ సృష్టికర్తకే అంకితమైపోండి. ఆయన నిత్యుడు, శాశ్వతుడు. ఇది సరయిన ధర్మం. వేరయిపోవడం అంటే ఇదే.

జీవితాన్ని ఆయనవైపుకే, జీవితపు ఉరుకులు పరుగులు ఆయన వైపునకే మరల్చుకోండి. ఆయన్నే వాటికి లక్ష్యంగా, ఆశయంగా చేసుకోండి. ఏమిచేసినా మిగిలి ఉండేవాడయినే. ఏ పనిచేసినా ఆయన ప్రీతి, శ్రద్ధలు ఆయన దయకోసమే చెయ్యండి.

వ యబ్ ఖా వజ్‌హు రబ్బిక జుల్‌జలాలి వల్ ఇక్రామ్ (గౌరవం, వైభవాలు కలవాడయిన ఆయన మాత్రమే మిగిలి వుంటాడు)

తబత్తల్ (వైదొలగడం)లో చిత్తశుద్ధి కూడా వుంది. అల్లాహ్ కోసం ఏకాగ్రతా వుంది. జీవితమంతా ఇతరులెవ్వరికీ భాగస్వామ్యం కల్పించ కుండా ఆయన విధేయతా, దాస్యాలకు అర్పించుకోవడం కూడా వుంది. ప్రాణికోటి నుండి వేరయిపోవడం అంటే ప్రపంచం మరియు ప్రాపంచిక జీవితాన్ని తెంచుకోవడం కాదు. దాని అర్థం అల్లాహ్ పట్ల అందరికన్నా ఎక్కువ ప్రేమ కలిగి ఉండటం. ఇతర అన్ని సంబంధాలకన్నా అధికంగా అల్లాహ్‌తో సంబంధం పెట్టుకోవడం. మనసు అల్లాహ్‌నే అంటిపెట్టుకుని

ఉండటం. చూడడానికి సమస్త కృషి ప్రపంచాన్నే అంటిపెట్టుకొని వున్నట్లు అగుపడినా అది ప్రాపంచిక ప్రయోజనాల కోసం కాకపోవడం. దృష్టి ఆయన అధికారంపైనే నిలవడం. భరోసా కేవలం ఆయనపైనే ఉండటం. ఇటువంటి వైముఖ్యం ప్రపంచంలోని ఏ వ్యవహారాన్నీ, అలవాటునూ మానుకోమని కోరదు. వివాహం అయినా, ఉపాధి అన్వేషణ అయినా, విద్యార్జన అయినా, వృత్తినైపుణ్యం అయినా, మానవ సంబంధాలయినా లేక రాజకీయాలయినా సరే.

దైవప్రవక్త(స) ప్రవచించారని హజ్రత్ అబూజర్ గఫ్ఫారీ(రజి) అంటున్నారు: నిష్ఠ లేక సన్యాసం అంటే అల్లాహ్ ధర్మసమ్మతం చేసిన వస్తువుల్ని తనకోసం హరాం (నిషిద్ధం) చేసుకోవడం కాదు. లేదా మీ వద్దనున్న సొమ్మును విచ్చలవిడిగా ఖర్చుబెట్టేసి రిక్తహస్తులు కావడం కాదు. వైరాగ్యం అంటే, ఏ వ్యవహారం యొక్క పర్యవసానం అయితే అల్లాహ్ చేతుల్లో వుందో కేవలం దానిపైన్నే భరోసా వుండడం (ప్రతి వ్యవహారమూ అల్లాహ్ చేతుల్లోనే వుంది) తప్ప మీ చేతుల్లో వున్న వ్యవహారం కాదు. (ఏ వ్యవహారమూ మన చేతుల్లో లేదు) వైరాగ్యం, ఈ నిష్ఠద్వారానే దైవంపై భరోసా కలుగుతుంది.

## దేవునిపై నమ్మకం

ఆ తరువాత ఆ నమ్మకం గురించే బోధించడం జరిగింది.

"రబ్బుల్ మష్రిఖి వల్ మగ్రిబి లా ఇలాహ ఇల్లాహు వ ఫత్తఖిజ్హు వకీలా."

తూర్పు, పడమరలకు స్వామి ఆయనే. ఆయన తప్ప వేరే దైవం లేడు. కనుక ఆయన్నే నీ వకీలుగా చేసుకో.

ఇక్కడ 'నామవాచకం' 'రబ్' యొక్క గుణం పేర్కొనబడింది.

ఆయన తూర్పు, పడమరల యజమాని. తూర్పు పడమరలు అంటే సకల ప్రపంచం, సకల సృష్టి అన్నమాట. మనం మన భాషలో కూడా తూర్పు పడమరలను ఈ అర్థంలోనే వాడుకుంటాం. ఆ ప్రభువు, ఆయనే సకల ప్రపంచానికీ పోషణకర్త. ప్రతిప్రాణి యొక్క ప్రతి అవసరాన్నీ, ప్రతి అక్కరనూ తీర్చేవాడు ఆయనే. అన్ని అధికారాలూ ఆయన చేతుల్లోనే వున్నాయి. ప్రతిదానిపై ఆయనకే అధికారం వుంది. ఆయన తప్ప అధికారి ఎవరూలేడు. కాబట్టి ఆయన్నే నీ వకీలుగా చేసుకో.

మన వ్యవహారాన్ని ఎవరికైతే అప్పగిస్తామో ఆయన్ను వకీలు అంటాము. మన వ్యవహారం విషయంలో మనం ఎవరినయితే నమ్ము కుంటామో ఆయనకే మన వ్యవహారాన్ని అప్పగిస్తాము.

1. ఆయనకు మీ వ్యవహారం గురించి పూర్తిగా తెలుసు అనీ,

2. మీ తీర్పు మీకు అనుకూలంగా వచ్చేటట్లు చేయడం, లేక చేయించగలగడానికి పూర్తిగా తగినవాడు, శక్తిగలవాడు.

3. ఆయనకు మీ వ్యవహారాన్ని తన చేతుల్లోకి తీసుకునే ఆసక్తి కలిగినవాడు.

ఇందుచేతనే అల్లాహ్ నేమల్ వకీల్. బికుల్లిషయ్యిన్ అలీమ్, అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. ఇలాహ్, రహ్మాన్, రహీమ్‌లాంటి సుగుణాల వల్ల ఆయన ఆసక్తి, ప్రేమానుబంధాలు ఎలాంటివో స్పష్టమవుతున్నాయి.

కాబట్టి నీ సకల పరిస్థితులు, వ్యవహారాల్ని ఆయనకు అప్పగించు. ఆయనపై పూర్తిగా భరోసా వుంచు. ప్రత్యేకించి ఆయన కార్యాలే అయిన దైవదౌత్యం, దైవసందేశ ప్రచారానికి సంబంధించిన వ్యవహారాలు నీకు అప్పగించడం జరిగింది. ఆ పనిలో నీకు ఆయన తోడ్పడ్డాడు. ఆయన్ని నమ్ముకోవడానికి, 'ఫ ఇన్నక బి అ-యునినా' (నిస్సందేహంగా నీవు మా

దృష్టిలో ఉన్నావు) లేక "ఇన్ననీ మ-కుమా అస్మఉ వ అరా" (నేను నీవెంట వున్నాను, వింటాను, చూస్తాను), "అలైసల్లాహు బికాఫిన్ అబ్దుహు" (తన దాసునికి అల్లాహ్ చాలడా?) అన్న పదాలు చాలవా?

ఆయన "నేమల్ మౌలా, నేమల్ వకీల్ (ఎంతగొప్ప ప్రభువో! ఎంత గొప్ప కార్యసాధకుడో!) ఆయన "వకఫాబిల్లాహి వకీలా" (కార్యసాధనకు అల్లాహ్‌యే చాలు) అన్న శుభవార్తనిచ్చాడు. "వమయ్ యతవక్కల్ అలల్లాహి ఫహువ హస్బుహూ (అల్లాహ్‌ను నమ్ముకున్నవాడికి తాను చాలినంతవాడై అయిపోతాడు) అని వాగ్దానం చేస్తున్నాడు. ఇదంతా తెలుసు కున్నవాడు అప్రయత్నంగా ప్రార్థిస్తున్నాడు.

"హస్బియల్లాహు లాఇలాహ ఇల్లా హువ అలైహి తవక్కల్‌తు వహువ రబ్బుల్ అర్షిల్ అజీమ్"

('నాకు అల్లాహ్‌యే చాలు. ఆయన తప్ప వేరే దేవుడు ఎవరూ లేరు. నేను ఆయన్నే నమ్ముకున్నాను. ఆయనే సర్వోన్నత పీఠానికి అధిపతి) నమ్ముకోవడం అంటే సర్వోన్నత పీఠానికి అధిపతి అయిన అల్లాహ్ ఏర్పర్చిన వనరులను, కారణాలను విడిచిపెట్టడం కాదు. తవక్కల్ అంటే కార్యకారణాలను- వనరులనే సర్వం అనుకోకూడదు. వాటి వాస్తవాన్ని కళ్ళెదుట ఉంచుకోవాలి. ఈ నమ్మిక లేనిదే సందేశం, తీవ్రకృషి మార్గంలో వ్యతిరేకతల్ని, అభిశంసనల్ని ఎదుర్కోవడానికి అల్లాహ్ అభిలషించే నైతిక సుగుణాలు జనించవు. ఆ నైతిక సుగుణాలు ఇవి!

## వ్యతిరేకత, విమర్శలు- సందేశ ప్రచారకుని వైఖరి

"ప్రజలు అనే మాటలకు సహనం వహించు. చక్కని రీతిలో వారి నుండి దూరంగా తొలిగిపో. తిరస్కారులైన ఆ సంపన్నుల సంగతి నాకొదిలెయ్. వారికి కాస్త గడువునివ్వు."

సందేశ ప్రచార మార్గంలో, విరోధంలో మొట్టమొదట ఉపయోగించబడేవి నోళ్ళే. రకరకాల మాటలు వినబడతాయి, వినబడుతూనే వుంటాయి. ఈ మాటలపోట్లు శారీరక, ఆర్థిక గాయాల కన్నా తీవ్రంగా వుంటుంది. శరీరం గాయపడితే ఆ గాయం కొన్నాళ్ళకు మానిపోతుంది. ఆర్థిక నష్టం కలిగితే దానికీ పరిహారం లభించవచ్చు. కాని నోటివల్ల మనసుకు కలిగే గాయం మానడంగానీ దానికి పరిహారంగాని కుదరదు.

విరోధులు తిరస్కరిస్తారు. పరిహసిస్తారు. వ్యంగ్యాస్త్రాలను వదులుతారు. ఎత్తిపొడుపు మాటలంటారు. అపనిందలు వేస్తారు. తప్పులు వెదుకుతారు, చెడులు చెప్పుకుంటూ తిరుగుతారు- ఈ మాటల వల్ల నిరుత్సాహం కలిగి, ధైర్యం సన్నగిల్లుతుంది. మనసు విరిగిపోతుంది. దుఃఖం, విచారం కలుగుతుంది. నిరాశ, నిస్పృహలు చోటుచేసుకుంటూ పోతాయి. నోటిమాటల వల్ల కలిగే గాయం చాలా తీవ్రమయిన గాయం.

అందుచేత అల్లాహ్, మాటల ఈటెలపోట్లు ఎలా వుంటాయో, ఎంత తీవ్రంగా ఉంటాయో పదేపదే పేర్కొన్నాడు. లోకులు కల్పించే మాటల పట్ల సహనం వహించమని, విచారానికి లోనుకావద్దని స్థిరచిత్తంతో సందేశ ప్రచారంలో నిమగ్నమయి ఉండాలని తాకీదు కూడా చేశాడు. (తాహా: 20: 130, సాద్: 38: 17, ఖాఫ్ 50: 39)

సహనమార్గం కూడా చూపాడు. "గతించిన ప్రవక్తలకు ఎదురయిన పరిస్థితులు, వారు చూపిన సహనం గుర్తుంచుకో" (సాద్, నూర్) "అల్లాహ్ స్మరణలో ఆయన స్తోత్రంలో నిమగ్నుడవయిపో" (తాహ, ఖాఫ్)

ముజ్జమ్మిల్ సూరాలో మొదటగా వచ్చిన ఆదేశం, రాత్రి నమాజ్ మరియు స్మరణ గురించిన ఆదేశం. లోకులు కల్పించే మాటలకు సహనం పాటించమన్న ఆదేశం తర్వాత వచ్చింది. తాహా సూరా మరియు ఖాఫ్

సూరాలలో ఈ క్రమం మార్చబడింది. సహనం వహించమన్న ఆదేశం మొదటగా, నమాజ్, దైవనామ స్మరణ, దైవస్తోత్రం గురించిన ఆదేశం తర్వాత వచ్చింది. అంటే సహనానికి మూలం నమాజ్, స్మరణ, స్తోత్రం అన్నమాట. దాని పటిష్టత, నిలకడల సామగ్రి కూడా ఇదే. వ్యతిరేకుల సమూహంలో అల్లాహ్‌ను స్మరించడం అన్నది సహనం లేనిదే సాధ్యంకాదు.

సహనం పాటించు అంటే అర్థం, నీ స్థానం నుండి తప్పుకోకు. అడుగులు తడబడకూడదు. నిరాశ చోటుచేసుకోకూడదు. నిరుత్సాహం కలగ కూడదు. సహనం పాటించడం అంటే మరో అర్థం చెడుకు జవాబు చెడుతో ఇవ్వడంకాదు. పైగా సహనానికి అత్యున్నత స్థానం చెడుకు జవాబు మేలు చెయ్యడం, తిట్లకు జవాబు దీవెనలు.

"చెడును శ్రేష్టమైన మంచి ద్వారా తొలగించు. ఈ సుగుణ యోగం సహనశీలురకు తప్ప మరెవరికీ లభ్యంకాదు. ఈ స్థానం మహా అదృష్ట వంతులకు తప్ప మరెవ్వరికీ దక్కదు."

(హామీమ్ అస్సజ్దహ్: 41: 34- 35)

సహనానికి మూలస్థానం కూడా అల్లాహ్‌యే. "వమా సబ్రుక ఇల్లాబిల్లాహ్" (నీ సహనం అల్లాహ్ తోడు లేనిదే సాధ్యంకాదు). "వస్బిర్ లిహుక్మి రబ్బిక ఫ ఇన్నక బి అ-యునినా" (నీ ప్రభువు తీర్పు వచ్చేవరకూ సహనం వహించాలి. నీవు మా కళ్ళెదుటే వున్నావు).

సహనంతోపాటు మంచితనంతో వారినుండి వైదొలగిపొమ్మని కూడా ఆదేశించబడుతోంది. 'హజర్' అంటే అర్థం విడిచిపెట్టడం. సంబంధాలు తెంచుకోవడం, సోషల్ బాయ్‌కాట్ చేయడం కాదు. వైదొలగడంతో పాటు మంచితనంతో అన్ని షరతులు కూడా విధించబడ్డాయి. జమీల్ (మంచితనంతో) అన్న పదం సంబంధాలను తెంచుకోవడం అన్న దాన్ని

వ్యతిరేకిస్తుంది. దైవప్రవక్త(స) అల్లాహ్ ఇచ్చిన ప్రతి ఆజ్ఞనూ పాటించారు. ఆయన(స) తన బద్ధ విరోధులతోనూ కలివిడిగా ఉండటం, వారివెంట కూర్చోవడం, లేవటం, తినడం, త్రాగటం, సమావేశం, సంభాషణ, ఇచ్చి పుచ్చుకోడాలు అన్నీ విడిచిపెట్టిన ఉదాహరణ ఏదీ ఆయన(స)గారి మక్కా జీవితంలో మచ్చుకైనా కానరాదు. అందుచేత అటువంటి ప్రవర్తన ఇక్కడ సూచించబడుతున్న ఈ 'వైదొలగడం' అన్న పరిధిలోకి రాదు అనడంలో ఎటువంటి అనుమానానికీ ఆస్కారం లేదు.

'హజరె జమీల్' (మంచితనంతో వైదొలగటం)లో అంటే, చెడుకు జవాబు మంచితనంతో ఇవ్వడం మాత్రమే కాక చెడుకు జవాబు చెడుతో ఇవ్వకూడదన్న విషయం కూడా దాగుంది. వైరం, విరోధం, ప్రతీకారం, దూషణ, శాపనార్థాలు, జగడాలు- ఇవన్నీ సందేశదాత వైఖరిలో చోటుచేసుకో జాలవు.

మంచితనంతో వైదొలగడం అంటే మరో అర్థం వ్యతిరేకుల నోటికి చిక్కకు, వారి సిగ్గుమాలినతనాన్ని బొత్తిగా విస్మరించు. వారి అమర్యాదకర ప్రవర్తనకు బదులివ్వకు. ఇంకా ఈ 'విడిచిపెట్టడం' కూడా విచారం, ఆగ్రహం, ఊగిసలాటలతో వుండరాదు. ప్రత్యక్షంగా ప్రాపంచిక సంబంధాలు, మాటామంతీ కలిగివుండు. సంబంధాలు తెంచుకోకు. అయితే అల్లాహ్ శత్రువులతో మానసికంగా సంబంధం పెట్టుకోకు. అల్లాహ్ మార్గంలో అనుచరులయిన వారితో ఉండాలి అనే భావం హజ్రె జమీల్ అనే పదంలో ఉంది.

హజరె జమీల్ వైఖరి కోసం నీవు వ్యతిరేకుల వ్యవహారాన్ని అల్లాహ్‌కు వదలివేయడం అవసరం. వారిచేత బలవంతంగా ఒప్పించడం నీ ఆధీనంలో లేని పని. అది నీ బాధ్యతకూడా కాదు. నీ చేతిలో శక్తి, అధికారం లేవు. నీ పని ప్రచారం చెయ్యడం వరకే. వారి కర్మలు లెక్కతీసు

కోవడం అల్లాహ్ పని. ఈ వాస్తవాన్ని పొందిన సందేశదాత, విరోధుల వ్యవహారాన్ని అల్లాహ్‌కు వదలివేసినట్లయితే అతని పాదాలు న్యాయం, ఉపకారం, సహనాల మార్గం నుండి ఎప్పటికి తడబడవు.

హజరె జమీల్ (మంచితనంతో వైదొలిగే వైఖరి) సహనం లేనిదే సాధ్యంకాదు. అందుచేత మంచితనంతో వైదొలగమన్న ఆదేశానికి ముందు సహనం పాటించమనే ఆదేశం ఇవ్వబడింది.

సహనం కోరే మరో విషయం కూడా వుంది. విరోధులకు శాప నార్థాలు, వారి వైఖరివల్ల నిరాశతో క్రుంగిపోవడం చేయకూడదు. వారు సత్యం స్వీకరించేందుకు గడువునివ్వండి లేక వారికి విషయాన్ని అవగతపర్చడంమట్టుకే, ఆపై వారి విషయంలో దైవం తీర్పు ఎలా ఉంటుందో అలాగే జరుగుతుంది.

మరో విషయం కూడా తెలుస్తోంది. ఆయన(స) పట్ల వ్యతిరేకతలో, ఆయన్ని తిరస్కరించడంలో సంపన్నులు ముందున్నారు. ఎటువంటి సద్వర్తనతో దైవసందేశ ప్రదాత(స) జీవితం ఎలా ఉపమాయమానంగా గడిచిందో, అల్లాహ్ తన ప్రవక్త(స)కు ఇచ్చిన నైతిక శిక్షణ పూర్తి స్వరూపం ఎలాంటిదో ఈ రెండు ఆయతులలో మీ ముందుకు వచ్చింది.

## తుది హితోపదేశాలు

సూరా చివరిలో కొన్ని విలువయిన హితోపదేశాలున్నాయి. వాటి గురించిన ముక్తసరి ప్రస్తావన ఇది:

1. దైవప్రవక్త(స) చుట్టూజేరిన సమూహం పరిధి విస్తరించినపుడు అల్లాహ్ మానవీయ నిస్సహాయతలు, బలహీనతల దృష్ట్యా రాత్రి నమాజ్ (తహజ్జుద్)ను రద్దుచేసి నమాజ్ స్థాపనకు, జకాత్ చెల్లింపుకూ ఆదేశించడం జరిగింది.

మానవీయ బలహీనతలు, ప్రాపంచిక వ్యాపకాలను దృష్టిలో ఉంచుకుని ఇలాంటి అమూల్యమైన, కష్టతరమైన ఆరాధనను రద్దు చేయడానికి గల కారణాలేమిటో గుర్తుంచుకోవలసి ఉంటుంది. ఖుర్ఆన్ ఇలా సెలవిస్తోంది.

"మీలో కొందరు రోగగ్రస్తులు ఉంటారనీ, మరికొందరు ఉపాధి అన్వేషణలో తీవ్రకృషి సలుపుతూ ఉంటారనీ మరికొందరు దైవమార్గంలో పోరాడుతూ ఉంటారనీ అల్లాహ్‌కు తెలుసు".

ఇక్కడ ధార్మిక యుక్తికి చెందిన ఎంతో ముఖ్యమైన సూత్రం కూడా స్పష్టం అయింది. హితోపదేశ పరిధి విస్తరిస్తూపోవాలి, పోతుంది కూడా. బలహీనులు, వృద్ధులు కూడా ఈ పరిధిలోకి వచ్చి చేరగలరు. ధర్మంకోరే కనీస కోరికలు వారి స్తోమతను దాటకూడదు. సౌలభ్యం అనేది ధర్మానికి ప్రాతిపదికగా ఉండాలి. దైవప్రవక్త(స) పలుమార్లు సెలవిచ్చినట్లుగా, మానవుడి ఆధీనంలో, అధికారంలో ఉన్నదే ఫర్జ్ కాగలుగుతోంది. కనుక రాత్రి నమాజ్ స్థానంలో, నమాజ్ స్థాపనకు ఆదేశమివ్వడం, నమాజ్ స్థాపన, జకాత్ చెల్లింపు ప్రతి మనిషి స్తోమతకు లోబడే వుందనీ ఎవరి స్తోమతకూ మించి ఉండలేదనడానికి రుజువు.

కరుణామయుడు, కృపాశీలుడి కారుణ్యం, న్యాయం కోరేది ఏ మనిషిపైనా అతని స్తోమతకు మించిన భారం వెయ్యకూడదనే. కాని ఆయన ఇషా మరియు ఫజ్ర్ నమాజ్‌లను జమాఅత్‌తో చేసినందుకు పూర్తి రాత్రి నమాజ్ చేసిన దానికి సమానం చేయడం ఆయన కారుణ్యాన్ని వెల్లడిస్తోంది.

2. దానితోపాటు అల్లాహ్ మేలైన రుణాన్ని కూడా కోరాడు. ఈ మేలైన రుణం ధార్మిక కార్యాలలో ఖర్చుకోసం అడగబడింది. ఇది జకాత్ చెల్లింపుతో పాటు అదనంగా చేయబడే ఖర్చు. మేలైన రుణం, మనః

స్ఫూర్తిగా ఇవ్వాలి. కేవలం అల్లాహ్‌కోసమే ఇవ్వాలి. మనసారా ఇవ్వాలి. ఇచ్చి, ఉపకారం చేసినట్లు భావించకూడదు, ఉపకారం చేశానని ప్రకటించేదికాదు.

3. ప్రపంచంలో దైవమార్గంలో ఇక్కడ ఏమి ఖర్చుచేసినా అది పరలోకంలో ఉత్తమమయిన గొప్ప ప్రతిఫలం రూపంలో లభిస్తుందన్న ఈ నమ్మకమే దైవమార్గంలో ఖర్చుచేయడానికి హృదయాన్ని, జేబునూ తెరవగలుగుతుంది. ఈ ప్రతిఫలంపై దృష్టి నిలపడమే అన్ని కర్మలకూ తాళంచెవి (కీ).

4. నాలుగవది ఇస్తిగ్‌ఫార్ ఆదేశం. ఆత్మపరిశీలన, స్వీయకర్మల బేరీజు, పాపాలకు పశ్చాత్తాపం అందుకు అల్లాహ్ ఆగ్రహం, శిక్షల భయం, ఆయన వైపుకే మరలి మోక్షాలు అర్థించడం, జరిగిన పాపాలను సమర్థించు కోకపోవటం, పాపాలను ఆయనే మన్నించగలడని నమ్మడం. ఇవి ఇస్తిగ్‌ఫార్ వివరాలు. ధర్మమార్గంలోని తప్పనిసరి ప్రయాణ సామగ్రి చద్దిమూట.

ఇస్తిగ్‌ఫార్ (మన్నింపు దుఆ) వల్లనే ప్రపంచంలో కలిమి, సంపదల మార్గం తెరుచుకుంటుంది. ఇస్తిగ్‌ఫార్‌తోనే స్వర్గమార్గం కూడా తెరచు కుంటుంది. ఇస్తిగ్‌ఫార్‌తోనే మనసుకు, జాతులకు జీవితం లభిస్తుంది. మన్నింపు లభించనిదే స్వర్గప్రవేశం అసాధ్యం. ఇస్తిగ్‌ఫార్ ద్వారానే ప్రపంచంలో ఆకాశ ముఖద్వారాలు తెరవబడతాయి. పొలాల్లో బంగారం పండనారంభిస్తుంది. జీవనం వెల్లివిరుస్తుంది. సామర్థ్యం ఇనుమడిస్తుంది. (నూహ్)

"ఓ దుప్పటి కప్పుకున్నవాడా! రాత్రివేళ నమాజులో నిలబడుతూ ఉండు, కాని కొంచెంసేపు మాత్రమే. రాత్రిలో సగభాగం లేదా దానిని కొంచెం తగ్గించుకో లేదా దానిని కొంచెం పొడిగించుకో. ఖుర్ఆన్‌ను

నెమ్మదిగా ఆగి ఆగి పఠించు. మేము నీపై ఒక గంభీరమైన వాణిని అవతరింపజేయ బోతున్నాము. వాస్తవానికి రాత్రివేళ లేవడం మనస్సును అదుపులో ఉంచేందుకు ఎంతో అనువైనది. ఎందుకంటే పగటి వేళ నీకు చాలా పనులు ఉంటాయి. నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు. అన్నింటినీ వదిలి పూర్తిగా ఆయనకే అంకితమైపో. ఆయన తూర్పు పడమరలకు స్వామి. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు ఆయనకే అంకితమైపో. ఆయన తూర్పు పడమరలకు ఆయన తప్ప మరొక దేవుడు కాలేడు. కనుక నీవు ఆయననే వకీలుగా చేసుకో. లోకులు కల్పించే మాటలపట్ల సహనం వహించి మంచితనంతో వారినుండి వైదొలగిపో. సత్యతిరస్కారులైన ఈ సంపన్నుల సంగతి నాకు వదిలిపెట్టు. నేను చూసుకుంటాను. వీరిని కొంతకాలం ఇదే స్థితిలో వుండనివ్వు".

## చివరిమాట

ఈ చిన్న ముక్తసరి సూరా మీ చేతుల్లో వుంది. ఇది మానసిక శిక్షణకు తొలిమెట్టు. అందుకు ప్రాథమిక మరియు ప్రథమ పాఠ్యాంశం (సిలబస్). మీరు దానిని గట్టిగా హత్తుకుని, దానిప్రకారం అచరించ ప్రయత్నిస్తే ఇన్షాఅల్లాహ్ ప్రక్షాళన మరియు శిక్షణకు మార్గం మీకోసం సుగమం అవుతూపోతుంది. ఈ సూత్ర భాగాలను మరొకసారి మననం చేసుకోండి:

1. రాత్రి నమాజ్
2. ఖుర్‌అన్‌ను ఆగి ఆగి పఠించడం
3. అల్లాహ్‌వైపునకు ఆహ్వానం
4. దైవనామ స్మరణ
5. చిత్తశుద్ధి, ఏకాగ్రత

6. నమ్మిక (భరోసా)

7. సహనం

8. మంచితనంతో వైదొలగిపోవడం

9. నమాజ్ స్థాపన

10. జకాత్ చెల్లింపు

11. అల్లాహ్‌కు మేలైన ఋణం ఇవ్వడం

12. పరలోక ప్రతిఫలంపై దృష్టి

13. మన్నింపు దుఆ (ఇస్తగ్‌ఫార్)

## రాత్రి సమయంలో చేసే కొన్ని దుఆ లు

అల్లాహుమ్మ ఇన్నీ అవూజు బిరిజాక మిన్‌సఖ్‌తిక, వ బిముఆఫాతిక మిన్ ఉఖూబతిక వ అవూజుబిక మిన్‌క, లా ఉహ్‌సీ సనాఅ అలైక, అన్‌త కమా అస్‌నయ్‌త అలా నఫ్‌సిక.

ఓ అల్లాహ్! నీ ఆగ్రహం నుండి నీ అంగీకారం యొక్క శరణు కోరుతున్నాను. నీ శిక్ష నుండి క్షమాపణ యొక్క శరణు కోరుతున్నాను. నీకు శరణం. నీ స్తోత్రం హక్కు చెల్లించలేను. నీవు స్వయంగా చేసుకున్న నీ స్తోత్రం లాంటివాడివే.

అల్లాహుమ్మజ్ అల్ ఫీ ఖల్‌బీ నూరన్ వ ఫీ లిసానీ నూరన్ వజ్‌అల్ ఫీ సమ్‌యీ నూరన్ వ ఫీ బస్‌రీ నూరన్ వజ్‌అల్ ఫీ ఖల్‌బీ నూరన్, వ మిన్ అమామీ నూరన్ వజ్‌అల్ మిన్ ఫౌఖీ నూరన్. వమిన్ తహ్‌తీ నూరన్ అల్లాహుమ్మ అ-తినీ నూరా.

“ఓ అల్లాహ్! నా హృదయంలో నా మాటల్లో వెలుగు నింపు. నా వినికిడిలో, నా దృష్టిలో వెలుగునివ్వు, నా వెనుకా నా ముందూ

వెలుగునివ్వు, నాకు పైనా, క్రిందా వెలుగునివ్వు. నాకు వెలుగు ప్రసాదించు. (ముస్లిం)

అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ర్రజా బిల్ ఖజా, వ బర్దల్ అయ్షి బ-అదల్ మౌతి వలజ్జత న్నజ్రి ఇలావజ్హికల్ కరీమి వ ష్షౌఖ ఇలా లిఖాఇక ఫీ గైరి జర్రా ఇన్ ముజర్రతిన్ వలా ఫిత్నతిన్ ముజిల్లహ్-

ఓ అల్లాహ్! నీ తీర్పుపట్ల అంగీకారాన్ని, మరణానంతరం మధుర మైన జీవితాన్ని, నీ దయాభరిత రూపాన్ని, నీ దర్శనాన్ని, ఎటువంటి హాని, వక్రగతి లేకుండా నిన్ను కలుసుకునే ఆసక్తినీ అర్థిస్తున్నాను.

-: సమాప్తం :-

# తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్ ప్రచురణలు

| పుస్తకం పేరు | వెల (రూ.లు) |
|---|---|
| 1. దివ్యఖుర్ఆన్ | 270 |
| 2. ఖుర్ఆన్ అవగాహనం (30వ భాగం) | 200 |
| 3. దివ్యఖుర్ఆన్ (30వ భాగం) | 25 |
| 4. హదీసు వెలుగు | (స్టాకులో లేదు) |
| 5. హదీసు వెలుగు (అరబీ మూలంతో) | 90 |
| 6. ప్రవక్త ప్రవచనం (అరబీ మూలంతో) | 80 |
| 7. ఇస్లామీయ జీవన సరళి | 90 |
| 8. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) | 60 |
| 9. ఇస్లాం అపార్థాల మబ్బుల్లో | 80 |
| 10. ఇదియే ఇస్లాం | 50 |
| 11. నేను ఆరాధించే ఇస్లాం | 30 |
| 12. వెన్నెల తెరలు | 24 |
| 13. సందేహాలు-సమాధానాలు | 25 |
| 14. జుమా ప్రసంగాలు | 75 |
| 15. సంకెళ్ళు | 24 |
| 16. ప్రభువు పిలుస్తున్నాడు | 25 |
| 17. ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు | 12 |
| 18. ధర్మపథంలో జీవనరథం | 18 |
| 19. ఇస్లాం శిక్షణ | 25 |
| 20. ఆరాధనలు | 10 |
| 21. నమాజ్ పుస్తకం | 12 |
| 22. ఇస్లామ్ ప్రవక్త ముహమ్మద్ | 12 |
| 23. ఇస్లామ్ మరియు అజ్ఞానం | 10 |
| 24. సాక్ష్యం మానవాళి సమక్షంలో | 10 |
| 25. ఇస్లాం రాజకీయ సిద్ధాంతం | 10 |
| 26. హేతువు కాంతిలో దైవప్రవక్త | 10 |
| 27. ప్రవక్త సందేశం | 10 |
| 28. ఖుర్ఆన్ అవగాహనకు మూలసూత్రాలు | 12 |
| 29. భవబంధాలు మోక్షానికి ప్రతిబంధకాలా? | 08 |
| 30. అంటరానితనం | 10 |
| 31. ఆదర్శమూర్తి | 10 |
| 32. శ్రేయస్కరమార్గం | 10 |
| 33. మరణానంతర జీవితం | 6 |
| 34. ధర్మ సంస్థాపనం | 8 |
| 35. నమాజ్ | 7 |
| 36. ఇస్లాం పరిచయం | 10 |
| 37. ముఖ్య హితవులు | 8 |
| 38. కారుణ్య వ్యవస్థ | 10 |
| 39. దివ్యఖుర్ఆన్ ముహమ్మద్ రచనకాదు | 6 |
| 40. పరదా ప్రగతికి ప్రతిబంధకమా? | 6 |
| 41. యదార్థమేది? | 6 |
| 42. దైవ నియమావళి | 6 |
| 43. లోకశాంతి | 10 |
| 44. మతము - రాజకీయం | 8 |
| 45. నిర్మాణం - విచ్ఛిన్నం | 10 |
| 46. ముస్లిం పర్సనల్ లా | 10 |
| 47. ఈమాన్ వాస్తవికత (ఖుత్బాత్ 1వ భాగం) | 18 |
| 48. ఇస్లాం వాస్తవికత (ఖుత్బాత్ 2వ భాగం) | 15 |
| 49. ఆరాధనల వాస్తవికత (ఖుత్బాత్ 3వ భాగం) | 18 |
| 50. జకాత్ వాస్తవికత (ఖుత్బాత్ 4వ భాగం) | 15 |
| 51. హజ్ వాస్తవికత (ఖుత్బాత్ 5వ భాగం) | 18 |
| 52. కలిమయే తయ్యిబా అర్థం | 8 |
| 53. అల్ ఫాతిహా (తఫ్హీముల్ ఖుర్ఆన్) | 6 |
| 54. ఇస్లామీ మతధర్మం | 15 |
| 55. పెట్టుబడిదారీ-సామ్యవాదం-ఇస్లాం | 8 |
| 56. ఇస్లాం దృష్టిలో మద్యనిషేధం | 4 |
| 57. ధర్మపథం | 8 |
| 58. సత్యధర్మం | 10 |
| 59. ఖురానీ గాథలు | 10 |
| 60. దైవప్రవక్తలు (1వ భాగం) | 8 |
| 61. దైవప్రవక్తలు (2వ భాగం) | 8 |
| 62. దైవప్రవక్తలు (3వ భాగం) | 8 |
| 63. దైవప్రవక్తలు (4వ భాగం) | 10 |
| 64. నీతి కథలు (1వ భాగం) | 8 |
| 65. నీతి కథలు (2వ భాగం) | 8 |

| | | |
|---|---|---|
| 66. | నీతి కథలు (3వ భాగం) | 10 |
| 67. | నీతి కథలు (4వ భాగం) | 10 |
| 68. | ఈ తల్లి ఒడిలో... | 8 |
| 69. | బుష్రా ఉత్తరాలు | 5 |
| 70. | ప్రియమైన అమ్మకు... | 8 |
| 71. | తీర్పులు | 10 |
| 72. | విరిసిన మొగ్గలు | 10 |
| 73. | మణిహారం (1వ భాగం) | 10 |
| 74. | మణిహారం (2వ భాగం) | 10 |
| 75. | మహనీయుల బాట (1వ భాగం) | 10 |
| 76. | మహనీయుల బాట (2వ భాగం) | 10 |
| 77. | నికాహ్ ప్రసంగం | 16 |
| 78. | జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (1వభాగం) | 2 |
| 79. | జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (2వభాగం) | 16 |
| 80. | జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (3వభాగం) | 15 |
| 81. | దివ్యగ్రంథంలో దైవప్రవక్త | 35 |
| 82. | దైవదాస్యమే మానవ ఔన్నత్యం | 10 |
| 83. | మానవ హక్కులు | 10 |
| 84. | జాతీయ సమైక్యత | 9 |
| 85. | ఇస్లాం ప్రబోధిని (మొదటి భాగం) | 9 |
| 86. | ఇస్లాం ప్రబోధిని (రెండవ భాగం) | 18 |
| 87. | ఇస్లాం ప్రబోధిని (మూడవ భాగం) | 25 |
| 88. | ఇస్లాం ప్రబోధిని (నాల్గవ భాగం) | 30 |
| 89. | బైబిల్‌లో ముహమ్మద్ | 10 |
| 90. | మానవులు - సమస్యలు | 16 |
| 91. | దైవమార్గంలో సతత సమరం-జిహాద్ | 10 |
| 92. | ప్రియ ప్రవక్త (సఅసం) | 10 |
| 93. | మానవసేవ | 8 |
| 94. | టెర్రరిజం-ఇస్లామీయ బోధనలు | 15 |
| 95. | మాటల ముత్యాలు | 35 |
| 96. | హజ్రత్ సాలిమ్ (రజి) | 8 |
| 97. | సామాజిక న్యాయం ఇస్లాంలోనే సాధ్యం | 8 |
| 98. | ఇస్లామీయ పరిభాషలో జిహాద్ | 35 |
| 99. | రండి! ఈ ప్రపంచాన్ని మారుద్దాం! | 20 |
| 100. | భారతీయ సమాజంలో పరమత సహనం | 20 |
| 101. | నవయుగం నవతరం | 8 |
| 102. | భారత దేశంలో ఇస్లామీ సందేశం | 15 |
| 103. | ఇస్లాం ఉగ్రవాదానికి వ్యతిరేకం | 20 |
| 104. | సత్యాన్వేషణ | 15 |
| 105. | మానవుల్లో సోదరభావం | 8 |
| 106. | శాంతి ఎలా స్థాపితమవుతుంది? | 12 |
| 107. | పరలోక భావన భారతీయ సాంప్రదాయాలు | 10 |
| 108. | హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) | 12 |
| 109. | హజ్రత్ ఉమర్ ఫారూఖ్-యె-అజమ్ (రజి) | 15 |
| 110. | హజ్రత్ ఉస్మాన్ గని (రజి) | 15 |
| 111. | హజ్రత్ అలీ (రజి) | 15 |
| 112. | ప్రవక్త (సఅసం) వారి ప్రాణమిత్రులు | 25 |
| 113. | అమెరికాలో నవ ముస్లిముల వాస్తవ గాథలు | 15 |
| 114. | ఇస్లాం అధ్యయనం ఎందుకు చేయాలి? | 8 |
| 115. | నిన్ను నీవు తెలుసుకో | 10 |
| 116. | స్వీయ సంస్కరణ | 10 |
| 117. | బాలశ్రామికులు | 10 |
| 118. | జమాఅతె ఇస్లామీ హింద్ ప్రాధాన్యతలు | 15 |
| 119. | దైవదౌత్యం ముగింపు | 15 |
| 120. | ధర్మపథంలో అవరోధాలు | 12 |
| 121. | హజ్రత్ ఆయెషా (రజి) | 30 |
| 122. | ఎడారిపువ్వు | 70 |
| 123. | మానవులంతా ఒక్కటే | 8 |
| 124. | మధురమైన మాటలు | 10 |
| 125. | తూరుపుతావి | 30 |
| 126. | ఖుర్ఆన్ 24 ఆయత్‌లు-అభ్యంతరాలు, వాస్తవికత | 12-00 |
| 127. | ఖుర్ఆన్ అవగాహనం (మొదటి సంపుటం) | 150 |
| 128. | హజ్ పరమార్థం | 8 |
| 129. | ఒక మనిషి రెండు వైఖరులు | 8 |
| 130. | క్యాంపస్ గైడ్ (ఎస్.ఐ.ఓ.) | 50 |
| 131. | ఖుర్ఆన్ దైవగ్రంథం | 15 |

132. తెలుగు అధికార భాష కావాలంటే... 40
133. దానా హకీమ్ 12
134. దాంపత్య నియమాలు 12
135. ప్రపంచ మతాలు - ఇస్లాం 30
136. భారత స్వాతంత్ర్యోదమం- ముస్లింలు 25
137. మైసూరు పులి- టిప్పుసుల్తాన్ 25
138. షహీద్ యె ఆజం-అష్ఫాఖుల్లా ఖాన్ 25
139. మానవ మహోపకారి ముహమ్మద్ (స) 5
140. మేరాజ్ యాత్ర - సందేశం 10
141. ఒడి నుండి సమాధి వరకు 15
142. రమజాన్ శుభాలకు అర్హులు 8
143. రమజాన్ సత్కార్యాల సమాహారం 20
144. హజ్రత్ ఇమామ్ హుసైన్ 10
145 అంతరిక్ష అధ్యయనం-దివ్యఖుర్ఆన్ 150
146. భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లిం మహిళలు 160
147. ఉమ్మడి కుటుంబం - ఇస్లామ్ 15
148. బహుభార్యత్వం-ఎప్పుడు-ఎందుకు? 15
149. భ్రూణహత్యలు 12
150. వివాహ సంబంధాల ఎంపిక ఎలా చేయాలి? 12
151. వివాహసంబంధాలు-అసమానతా భావాలు ఇస్లామ్ 12
152. వివాహాలు దుబారా ఖర్చులు 12
153. లింగవివక్ష 12
154. సంతానానికి శిక్షణ 12
155. తలాఖ్ 12
156. దిక్సూచి 100
157. జాతి నిర్మాణంలో నైతిక విలువలు 8
158. మీలాదున్నబి 8
159. యథార్థాల అద్దంలో కామన్ సివిల్‌కోడ్ 15
160. కట్న కానుకలు వారసుల ఆస్తిహక్కులు 12
161. మహిళల ఉపాధి - పరిధులు, అవసరాలు 12
162. మహాప్రవక్త సహచరుల సందేశ సరళి 20
163. సత్య సందేశం - ముస్లిమేతరులు 12
164. దైవసాన్నిధ్యం కోసం ఏం చేయాలి? 10
165. విపులా చ పృథ్వీ 50
166. ప్రవక్త(స)పలుకులు జరిగిన సంఘటనలు 15
167. శిక్షణకు తొలిమెట్టు 15
168. దంపతుల హక్కులు 20
169. ఇస్లామీయ ఉద్యమం-కార్యకర్తలు 8
170. బాలల సంవత్సరం-ఇస్లాం సందేశం 10
171. లైంగిక సంబంధాలు ప్రకృతి నియమాలు 25
172. సూక్తి శతకం 15
173. తల్లిదండ్రులు-సంతానం హక్కులు బాధ్యతలు 20
174. The Holy Quran is Infallible 150
175. భారత స్వాతంత్ర్య సంగ్రామం- ముస్లిం యోధులు -1వ భాగం 200
176. భారత స్వాతంత్ర్యోద్యమం- ముస్లిం ప్రజాపోరాటాలు 100
177. ఇస్లాం సుశిక్షణా వ్యవస్థ 25
178. ఉర్దూ సాహిత్యం 100
179. రమజాన్‌కు స్వాగతం 15
180 ఇస్లాం ధ్యేయం ఏమిటి? 30
181. విజయానికి ఏకైక మార్గం ఇస్లాం 10
182. బాలబాలికలకు ఖుర్ఆన్ పరిచయం 20
183. ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతరుల హక్కులు 15
184. రమజాన్ ఉపవాసాలు 20
185. ఖుర్ఆన్ ఆడియో కేసెట్ల సెట్టు(60 కేసెట్లు) 1600
186. దివ్యఖుర్ఆన్ ఆడియో సి.డి.లు (4 సి.డి.లు) 100

**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్** (రిజిష్టర్డ్)
సందేశభవనం, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002. ఫోన్: 24564583